

# గృహలక్ష్మి

## స్త్రీల సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు:
డాక్టరు. కే. యన్. కేసరి

# GRIHALAKSHMI

## LADIES' TELUGU MONTHLY

మే—1948

సంపుటము ౧౭]



[సంచిక ౫




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# శ్రీ సర్వధారినామ సం॥ర వైశాఖ మాసము.

| | | | |
|---|---|---|---|
| | 10 | సో | శు పాడ్యమి 3-12 కృ 11-32 వైశాఖస్నానము చంద్రోదయం. [గరుడోత్సవం. |
| | 11 | మం | వి 1.11 రో 11.6 త్యా 3.55 పరశురామజయంతి పుష్పగిరి చెన్నకేశవస్వామి |
| | 12 | బు | త 43-48 మృ 9-32 ది 29-41 త్యా 3.50. |
| | 13 | గు | పం 48-29 ఆర్ద్రా 6-55 త్యా 3-46. |
| | 14 | శు | ష 42-31 పున 3-28 పుష్యమి 56-0 ది 22-8 హరిపదపుణ్యకాలం, |
| | 15 | శ | స 36-6 ఆశ్రే 54-53 వృ 34-53 ది 28-56 |
| మే | 16 | ఆ | అ 29-32 మృ 50-15 ది 22-29 అమృతయోగః |
| | 17 | సో | న 23-4 పూఫ 45-59 ది 8.39 తిథిద్వయం. కందిమల్లాయపల్లె వీరబ్రహ్మారాధన. |
| | 18 | మం | ద 16-54 ఉఫ 41-51 ది 2-30 సిద్ధాంతివారి శోత్సవః, |
| | 19 | బు | ఏ 11-22 హ 38-26 వజ్ర 3-56 సర్వత్ర ఏకాదశి. |
| | 20 | గు | ద్వా 6-36 చి 36-17 వ్య 51-10 కంచివరదరాజ ధ్వజారోహణం. |
| | 21 | శు | త్ర 2-50 స్వా 35.1 త్యా 4-0 మిధునాయనం. నృశింహజయంతి. |
| | 22 | శ | చతు 0-11 ఏష్యం 58-17 ఆన్వాధానం. వ్యాసపూర్ణిమ, కంచివరదరాజస్వామి [గరుడోత్సవము, వ్యాసపూర్ణిమ. |
| 1948-వ సం॥ | 23 | ఆ | కృ పాడ్యమి 58-21 రా 18-41. |
| | 24 | సో | వి 59-25 జ్యే 38-24 రా 27-32 |
| | 25 | మం | త 60-10 మూ 41-44 సా 36.41 త్యా 4-14. |
| | 26 | బు | త 1-50 పూ. షా. 46-15 త్యా 4-18 అహ. 32-1 కంచివరద రథోత్సవం. |
| | 27 | గు | చ 4-55 ఉషా 51.25 త్యా 4-21 కర్తరిత్యాగః. |
| | 28 | శు | పం 8 49 శ్ర 57-16 త్యా 4-24 |
| | 29 | శ | ష 13 1 ధని 60-10 త్యా 4-25. |
| | 30 | ఆ | స 17-31 ధని 3 14 త్యా 4-24. |
| జూన్ | 31 | సో | అ 21-57 శత. 9-14 త్యా 4-23 శూన్యతిధిః. |
| | 1 | మం | న 26-1 పూ. భా. 14 56 త్యా 4-21 |
| | 2 | బు | ద 29-30 ఉభా 20-4 త్యా 4-20 హనుమజ్జయంతి. |
| | 3 | గు | ఏ 32-10 రే 24-29 త్యాజ్యాభావః అమృతయోగః. |
| | 4 | శు | ద్వా 33.47 అశ్వి 28-1 ది 17-24 త్యా 4-15 |
| | 5 | శ | త్ర 34-15 భ 30-11 త్యాజ్యాభావః, శనిత్రయోదశి |
| | 6 | ఆ | చతు 33-?8 కృ 31 17 త్యా 4-5 మాసశివరాత్రి |
| | 7 | సో | ● అమా 31-26 రో 31-8 త్యా 3-55 పిండపితృయజ్ఞః అమా సోమవారవ్రతం, |

# వి ష య సూ చి క

—:o:—




తియ్యని బాధ




జయజయ గృహలక్ష్మీ సఖీ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

# కేసరీ హైస్కూలు వార్షికోత్సవము

కేసరీ హైస్కూలునకు, ఇంకొక సంవత్సరజీవితము జయప్రదముగా నడువగా ఉత్సాహముతో వార్షికోత్సవము సలుపబడినందులకు సంతసించుచున్నాము. ఉత్సవ వృత్తాంతమధ్యమున కార్యదర్శి చదివిన హైస్కూలుసాంవత్సరికనివేదిక ఇంత లేత వయస్సున ఏస్కూలైనను గర్వింపదగినది. ఇందు కీస్కూలు పాలకవర్గమువారెంతయు అభివందనీయులు.

చెన్నపురిలో తెలుగుబిడ్డలకు తెలుగుచదువు క్లుప్తమనే గోల ఈనాటిదికాదు. నేడు చెన్నరాజధాని ప్రభుత్వమువారు ప్రాంతీయభాషామూలకమున విద్యనంతయు బోధింపవలెనన్న విధానమును పట్టుదలతో సాధించుచున్నకొలది ఈగోల హెచ్చుపెరిగినది. ఈవాదు బహుదూరముప్రాకి ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులగు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారిచెవికి నెక్కగా వారు బహిరంగముగా అధిక్షేపించి యున్నారు. ఇట్లు దశదిశల మారుమ్రోగుచున్న ఈవాదు విని విని ప్రభుత్వమువారును "ఇటీవల చెన్ననగరమున తెలుగుపిల్లలకు తెలుగున విద్యనభ్యసింప నాటంకములేవైన కల్పింప బడెనా, విచారింపుడు" అని యొక కమిటీనికూడ నియమించిరి. ఇట్టిసంవిధానమున - ఈస్థితిని పూర్వమే ఊహించి, ఇందుకై ఏర్పడ్డ నీహైస్కూలు - ఒకటవ క్లాసునుండి

అరవఘారమువరకు - 498 మంది తెలుగుబిడ్డలకు తెలుగున బోధించుచున్నదనగా - ఈస్కూలు నిర్వాహకులు మిక్కిలిగా గర్వింపదగిన విషయము. ఇంతకన్న విద్యార్థుల సంఖ్య మించకుండుట విద్యార్థులు లేకగాదు; స్థలము చాలక! మేమెరింగినంతలో తెలుగు బిడ్డలకు తెలుగున బోధింపరాదన్న యుత్తరువులు ప్రత్యేకముగ నేమియు కానము; ఈ హైస్కూలు కార్యక్రమము ఏనాడును నిరోధింపబడలేదు. రెండు సం॥ల క్రిందట విద్యాశాఖమంత్రి - చెన్నపురి ఆంధ్రయువజనసమితికి జబాబిచ్చుచు - చెన్నపురిలో తెలుగున్నూ విద్యావిషయకముగా ప్రాంతీయభాషయే - అన్నారు. 1946 లో కార్పొరేషన్‌వారున్నూ - ప్రతిప్రాథమిక పాఠశాలలో ఏతరగతియందైనను ఒక సెక్షన్‌లోగాని, అన్నిసెక్షన్‌లలోగాని 20 మంది, అంతకుమించి తెలుగుబిడ్డలున్నచో ప్రత్యేకముగా నొక తెలుగు ఉపాధ్యాయునుంచుటకు నిర్ణయించిరి. ఉచితముగా, విద్యచెప్పు కార్పొరేషన్ స్కూళ్లలోనే ఇది పూర్తిగ అమలు జరిగిననాడు పిల్లలవద్ద జీతముపుచ్చుకొనే ప్రైవేటు స్కూళ్లలోను నిది అవశ్య మేర్పడును. అయితే కావలసినది, బిడ్డల తలిదండ్రులు శ్రద్ధగా నీవసతి ననుభవము లోనికి తెచ్చుకోవలెను; ప్రజానాయకులున్నూ ఆయా ఉత్తరువులు అమలులోనికివచ్చి తెలుగువారు అనుభవించునట్లు చూచుటకు తగిన సన్నాహము గావింపవలయును. అప్పుడిట్టిస్కూళ్లు ఇంకెన్నియో యేర్పడుటేగాక ఉన్న హైస్కూళ్లలోను తమిళముతోపాటు తెలుగులోను బోధన సాగునని మావిశ్వాసము.

నేడు కేసరీహైస్కూలునందు బాలభాలికలు కలిసిచదువుచున్నారు; బాలికలు 153 రున్నారు. గత సం॥ మే శ్రీ కేసరిగారు కన్యావిద్యాలయమును ప్రత్యేకముగా నేర్పరుప రు 1,00,000 లను విరాళమిచ్చియుండిరి. ఆలస్యమైనను వచ్చేనెలలో దీనిని హైస్కూలుగానే ప్రారంభింప అన్ని ఏర్పాట్లును జరిగిన వనుట సంతోషప్రదము. రెండు స్కూళ్లున్నూ ఆంధ్రబాలబాలికతో క్రిక్కిరిసి—"దేశభాషలందు లెస్స" యని శ్రీ కృష్ణదేవరాయలచే ప్రశంసింపబడిన మన మాతృభాషలో విద్యాబోధను నడిపించగలవు. చెన్నపురిలో ఒక్క తెలుగుబిడ్డకున్నూ తెలుగువిద్యబోధించు హైస్కూలు కరవాయెనన్న మాట అంతరించవలయునంటే - కార్యదర్శిగారు తమరిపోర్టు అంతమున కోరినట్లు స్కూలునందు స్థలము మున్నగు వసతు లన్నియు వృద్ధి పరుప విరివిగా ధనమును ఆంధ్రులు ధారాళముగా నొసంగవలయును.

గృహలక్ష్ముల కొక్క మనవి. ద్విభాషాప్రాంతముల మాతృభాష సంరక్షించుచున్న

కీర్తి గృహలక్ష్మిది. రామేశ్వరమునను, పునహానగరమునను, బొంబాయియందును, నాగపురములోను, మారిషస్‌దీవియందును, రంగూన్‌పట్నములోను తెలుగుగృహలక్ష్మి తెలుగుభాష విడిచిపెట్టలేదు. చెన్నపట్నమున తమబిడ్డలను తెలుగున చదివింప నవకాశములు లేకపోలేదని పైన వివరించి యుంటిమి. దానిని సంపూర్ణముగా నామె అనుభవించుటకై కృషిచేసిననాడే ఈహైస్కూలున కెడ తెగక తెలుగువిద్యార్థుల రాక యేర్పడి, ఇదియేగాక నిట్టివింక నగరమున నాలుగుమూలల నేర్పడ నవకాశమేర్పడును. చెన్నపట్నమునకు వెలిగానున్న తెలుగుగృహలక్ష్ములకును ఒక్కమనవి. మీరు నగరములో నున్న మీబంధుమిత్రులకు ఉత్తరములు వ్రాయునప్పుడు 'ఉభయకుశలోపరి' కన్నను ముందువ్రాయవలసిన మాట యొక్కటున్నది: అది "మీబిడ్డలకు తెలుగుననే చదువు చెప్పించుచున్నారుగదా" యని.

చెన్నపట్నంలో పూర్వము ప్రసిద్ధులైన స్త్రీ విద్యాభిలాషులగు శ్రీ కోమలేశ్వర పురం శ్రీనివాసపిళ్లగారిచరిత్ర క్లుప్తంగా వేరే ప్రచురించినాము. ఈ నగరంలో ప్రథమంగా తెలుగుబాలికా పాఠశాల 1866 లోనే ఏర్పడుటకు కారకుడైన ఈదాతను కేసరీ కన్యా విద్యాలయ మేర్పడుచున్న ఈశుభసమయమున మనసార స్మరింతుము.

ఇట్టి చెన్నపట్నమున తెలుగువారి ముఖ్యకోరిక లీడేర నీవిద్యాలయముల స్థాపించి పోషించుచున్న వితరణశాలికి శ్రీ కేసరిగారి కీశ్వరుడు ఇతోధి కాయురారోగ్యైశ్వర్యము లిచ్చి బ్రోచుగాక.

వెంకటప్ప.

---

[మేమీ ప్రధానవ్యాసము ముగించినపిదప, విల్లివాకంలో మద్రాసు మంత్రులు శ్రీ కళా వెంకట్రావు వేముల కూర్మయ్యగార్లు మద్రాసులో తెలుగుబిడ్డలకు తెలుగున బోధించు పాఠశాలల అవసరము నుపన్యసించి, అట్టివానికి ప్రభుత్వసహాయ మివ్వబడునని స్పష్టపరచినందులకు వారి నభినందింతుము. కేసరీహైస్కూలు వార్షికోత్సవమున వరుసగా, కమిటీ అధ్యక్షులు, కార్యదర్శి, సభ్యులు, స్థాపకులు, నగుఅల్లాడి, శేషాచలపతి, హైకోర్టు న్యాయమూర్తి గోవిందరాజాచారి, కేసరిగార్లు కోరినదియు నిదియేగదా. —వెం]

# శ్రీ శ్రీనివాసపిళ్లగారు

వీరు గొప్పసంఘ సంస్కర్తలు; ముఖ్యంగా విధవా వివాహములు, స్త్రీవిద్య మున్నగు విషయములలో ఎక్కువ అభిమానంతో కృషిచేసేవారు. ధైర్యసాహసాలు, శక్తిసామర్థ్యాలు కలిగిన ప్రజాహిత కార్యతత్పరులు. కొంతకాలం పచ్చయప్ప ధర్మపరిపాలక సంఘానికి అధ్యక్షులుగా ఉంటూవచ్చారు. తను బ్రతికుండగానే రు 70,000 లు దాకా విద్యావ్యాపకానికని దానధర్మాలు చేసినారు. 27-3-1858 చనిపోయినారు. తన స్వంతగ్రామమైన 'తొడుకాడు' ఆదాయం చాలాభాగం దానధర్మాలక్రింద వ్రాశారు; అందులో ఒకభాగం విద్యావ్యాపకానికి ప్రత్యేకించినారు. ఈ ధర్మకార్యములు పలిపేపని కూడా, తానుకొన్నాళ్లు అధ్యక్షుడైయున్న పచ్చయప్ప ధర్మపరిపాలనా సంఘానికే అప్పచెప్పారు.

ఈ కమిటీవారు శ్రీనివాసపిళ్లగారి పేర మొదట్లో సంస్కృతమున్నూ, ఇతరభాషలున్నూ చెప్పే పాఠశాల పెట్టించారు. కాని ఇంగ్లీషు చెప్పంది లాభంలేకపోయినది. మళ్లీ ఆంగ్లోవర్నాక్యులర్ స్కూలు పెడదాము అంటే అప్పటికే అలాంటివి చాలా ఉన్నాయి పట్నంలో. అందుచేత, "శ్రీనివాసపిళ్లగారు హిందూ స్త్రీలకు సంఘంలో ఔన్నత్యం కలిగించడానికి చాలా పాటుపడ్డారు కాబట్టి, పెద్దయింటి ఆడపిల్లలకు చదువుచెప్పించే యేర్పాట్లుచేస్తే బాగుంటుంది" అని నిర్ణయించారు. ఆ విధంగా 1866 అక్టోబరులో బాలికా పాఠశాలయొక్క తెలుగుశాఖ ఏర్పరిచారు. ఆ పిదప 1867 జూన్‌లో తమిళశాఖ ఏర్పాటు చేసినారు.



కోలాటమాడుచున్న బాలికలు

# శ్రీ కేసరీ కన్యా విద్యాలయము

## ఈ జూలైలో ప్రారంభమగును.

అధికార్ల అనుమతి కోరబడినది;
సకాలములో లభ్యముకాగలదని విశ్వాసము.

## విద్యాబోధన అంతయు తెలుగులో జరుగును

ప్రస్తుతం హైస్కూలు ఫారములు కొన్ని తెరువబడును.

## మైలాపూరు భీమన్నపేటలో

“హెర్మిటేజ్” అను పెద్దబంగళాయందు ఈవిద్యాలయ ముంచబడును.

ఈ విద్యాలయమునకై

## శ్రీ కేసరిగారు రు. 1,00,000 లను

1947 లోనే దానము చేసియున్నారు.

# స్వర్గీయ పాలపర్తి హనుమాయమ్మగారు

సుప్రసిద్ధ విదుషీమణియు, సంఘసేవా పరాయణురాలును, గృహలక్ష్మీ పాఠకులకు చిరపరిచితురాలునగు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి తల్లిగారగు పాలపర్తి హనుమాయమ్మగారు దివంగతులైనారని దెల్పుటకు చింతించుచున్నాను. యీయమ మంచి సంస్కారభావములుగల్గి తమబిడ్డలందరిని విద్యావంతులుగను, సంఘసంస్కారులుగను జేసినది. వృద్ధురాలై సనాతనాచారములనే పాటించుచున్నను నవీన సాంప్రదాయములను సైతమేవగింపులేక సంఘసంస్కార ప్రియత్వముగల్గియుండెడిది. ఈమెహృదయమున నెలకొన్న సంస్కారప్రియత్వమీమె బిడ్డలప్రవర్తనలో ప్రస్ఫుటమైనది. ఒక్కపుత్రుండు బ్రహ్మమతావలంబియై, బ్రహ్మమత ప్రచారకుడై, ధర్మసాధని పత్రికాసంపాదకుడై పేరొందినారు. వేరొకరు వీరేశలింగార్యబోధల నాచరణరూపేణా వెల్లడించుటకు వితంతూద్వాహమొనర్చుకొని, వితంతూద్వాహ సంఘమున పనిచేయుచున్నారు. యింకొకరు బాలికాపాఠశాలోపాధ్యాయులుగానుండి స్త్రీ విద్యాప్రచారము గావించుచున్నారు. ఇకపుత్రికయన్ననో సాహిత్యముగను, సాంఘికముగను స్త్రీ సంఘమునకు నిరంతరము జేయు సేవ పారములేనిది. మహిళాసంఘోద్ధరణకై సదాకృషిసల్పుట ఆంధ్రులెల్లరికిని విశదమే. తనబిడ్డలందరినిట్టి దేశభక్తులుగను, సంస్కర్తలుగను యొనర్పజాలిన హనుమాయమ్మగారి మాతృత్వము సార్థకము.

ఇక నామె ప్రత్యేకముగా మహిళాసంఘమునకొనర్చిన యుపకృతి మరువరానిది. మాభావపురమున స్త్రీహితైషిణీమండలి నెలకొల్పినదిమొదలు పదునారువర్షములుగా నీమెగావించిన ధర్మములు, లెక్కకు మిక్కిలిగానున్నవి. ప్రతివర్షంబును మండలిలో జరుపబడు మహాత్మాగాంధి జయంత్యుత్సవమునకయ్యెడు ఖర్చు తానుభరించెడిది. భవననిర్మాణసందర్భమున యేబదిరూప్యముల చందానొసంగి మండలియావరణములో బావినిత్రవ్వించినది. మండలికనుబంధముగానున్న సీతాపుస్తకసదనంబను గ్రంథాలయమునకారువందల గ్రంథములదానమొసంగినది. యీమెగావించిన యిట్టిదానము లీమె యుచితమెరిగిన వదాన్యతను వేనోళ్లచాటుచున్నవి. యీమెనుగాంచి నేర్వదగిన గుణపాఠంబు లెన్నేనిగలవు. సామాన్యవనితాలోకమునకాదర్శప్రాయురాలు. శివాజి గొప్పదేశభక్తుడగుటకు కారణభూతురాలగు జిజియాబాయి చారిత్రమెట్లుస్మరణీయమో యట్లే బిడ్డలందరును దేశాభిమానులై సంస్కరణపరాయణులై వన్నెకెక్కుటకు నీమాతృమూర్తియే కారణభూతురాలని చెప్పుటఅతిశయోక్తిగాదు. చిరస్మరణీయురాలగు నీమెమరణము మాకెల్లరకును సంతాపకరమైనది. కాని మనుజులకు మరణమనివార్యముగదా? వృద్ధురాలై పుత్రులసమక్షమున తనువుచాలించినది. భూమిపైజన్మించినందుకు సార్థకముగా సత్కార్యములనేకములుగావించినది, ధన్యురాలైనది. ఆయమమృతికి వగచెడు నాకుటుంబమునకు సానుభూతినిదెల్పుచున్నాను. అయినను "జననీజన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసి" యనిలోకోక్తిగదా? మాతృవియోగముచే దురపిల్లు నీమెబిడ్డలకిప్పట్లో యూరటజేకూరునా? యీపుణ్యవతి యాత్మకు శాంతిచేకూరుగాక, యీమెకివే నా నమస్సులు.

దేశిరాజు భారతీదేవి.



మాసోదరి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికి మాతృవియోగము కల్గినందుకు మేమెంతయు చింతిల్లుచు ఆమెకు మాతరఫునను, మాపాఠకులతరఫునను మాసానుభూతిని వెలిబుచ్చున్నాము. హనుమాయమ్మగారి ఆత్మకు శాంతికలుగుగాక. —గృ॥ సం॥

—: ౦ :—

# కేసరిగారు

కన్యల విద్యలకై
కనకపు సంచుల
నిచ్చెను
కేసరి — (కేసరిహైస్కూల్)

స్త్రీలకు "లోధ్ర"
వరప్రసాదం
కేసరి కుటీరం—
శారదాకిరీటం!

ఆంధ్రమహిళలకు
అందగ నిచ్చెను
"గృహలక్ష్మిని"-
ఏటేటా
రచయిత్రికి
కంకణ మొకటిచ్చును
కేసరి—దాత
పిల్లల తాత!

తంగిరాల పార్వతి

# శ్రీ కందుకూరి వీరేశలింగంగారి శతవార్షికోత్సవములు

●

శ్రీ కందుకూరు వీరేశలింగంపంతులుగారి శతవార్షికోత్సవము ఈ ఏప్రిల్ 16 వ తేదినుండి ఆంధ్ర దేశమున పలుతావులందు విశేషవైభవముతో జరుపబడినది. ముఖ్యముగా మద్రాసు రాజమహేంద్ర వరములలోజరిగినవి పేర్కొనదగినవి.

## మద్రాసు

మద్రాసులో శ్రీ గొ. రాజమన్నార్, గోవిందరాజాచారి, ప్రత్తిపాటి సత్యనారాయణ, కళ్యాణ సుందరం, గాడిచర్ల హరిసర్వోత్తమరావు బ్రహ్మయ్యమున్నగు వారందరు నడుముకట్టి నడిపించినారు.

16 వ తేదిన చక్కగాఅలంకరింపబడిన శ్రీ రాజాజీ (బాంక్వెటింగ్ హాలు) భవనమున సాయంకాలము 6 గంటలకే సభ కిటకిటలాడుచు నిండిపోయినది. సభాభవనము నలుమూలల తలత్రిప్పి చూచినవానికి కుడ్యముల నలంకరించిన దొరలపటములు, సభావేదికపై నిలుపబడిన పంతులువారి పటము - పరికించినంతనే, ఈ పెద్దమనుష్యులలో నెవ్వరును-ఇట్లీపంతులుగారి శతవార్షికవర్ధంతి - ఈ హాలులో నింతవైభవముగ జరుగునని కలలోనైన తలంచియుందురా అనిపించినది.

తొలుతగా శ్రీ మద్రాసు సంగీతకళాశాలా విద్యార్థినులు పంతులవారికి ప్రీతికరమగు నీశ్వరోపాసన సల్పిరి. తర్వాత శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు పంతులుగారు అధ్యక్షతవహించగా-బ్రహ్మయ్యగారు ఉత్సవసంఘమువారి రిపోర్టు చదివినయనంతరం-శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు సభాప్రారంభమొనర్చుచు గంభీరోపన్యాసమొసంగిరి. అందువారు విరివిగా శ్రీ పంతులుగారి భాషాసేవ, సంఘసేవమున్నగు వాని నన్నిటిని సవిమర్శకముగా ప్రశంసించిరి.

"ఈనాడు వితంతువివాహాలు నిరాక్షేపణీయంగా జరుగుతున్నా, బాల్యవివాహాలు శాసనరీత్యా నేరమైనా, స్త్రీలకు ఆస్తిహక్కులు లభించినా, వర్ణాంతరవివాహాలు సాధ్యమైనా, కులవివక్షతలు సమసినా, మనమందరం కృతజ్ఞతతో వీరేశలింగంగారి ప్రతిభాజ్యోతికి హారతులిచ్చి వారిస్మృతిని చిరస్థాయి చేయాలి." అనిఆయనపల్కిన గంభీరవాక్యము ఆంధ్రనారీమణులకు శిరసా వహింపదగ్గది. పిదప అధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు."ఆంధ్రదేశంలో విప్లవభావవ్యాప్తికి మూలపురుషుడు" అనివివరిస్తూ గంభీరముగా ఉపన్యసించారు.

ఆ తర్వాత ప్రముఖులంపిన సందేశాలను శ్రీ బ్రహ్మయ్యగారు చదివారు.

ఆటుతర్వాత చీఫ్‌జస్టిస్ శ్రీ రాజమన్నారు "మగవాడంటే శ్రీ వీరేశలింగం పంతులుగారు. ధైర్యం, సాహసం, నిర్భీతి, నిశ్చలత, ప్రపంచజ్ఞానం, కార్యదీక్షలతో సాంఘికాభివృద్ధికి భాషాభివృద్ధికి సేవచేసినా"రని ఉపన్యసించారు. వారిపిదప తమిళంలో ప్రఖ్యాతరచయిత అయిన కళ్యాణసుందరంగారు మాట్లాడుచూ పంతులుగారికృషిని మనంకూడా సార్థకంచేయాలంటే ఇంకాఎక్కువమంది స్త్రీలకు శాసన సభ్యత్వములు మంత్రిత్వములు ఇవ్వవలెను అన్నారు.

శ్రీ కళావెంకట్రావుగారు మాట్లాడుచు, ఈనాడే వివేకవర్ధనివంటిపత్రిక, వీరేశలింగంవంటి పత్రికా రచయితఉంటే దేశంలో ఈ దొంగవర్తకాలు, అవినీతితోలిగి ప్రజలకెంతో మేలుచేకూరుతుందిఅన్నారు.

ఆపిదప శ్రీమతి కుట్టిమాలు అమ్మాళ్ గారు (మంత్రిమాధవ మీనన్ గారిసతి) మృదుమధురమైన తెలుగు భాషలో ఇట్లుపన్యసించిరి:—

"మళయాళం నా మాతృభాషయైనా వీరేశలింగంగారి గౌరవార్థం తెలుగులో ఉపన్యసిస్తాను. తెలుగుదేశం పేరుచెప్పితే తెనాలిరామలింగని కథలు, తమిళదేశం పేరుచెప్పితే తంజావూరిదొంగ తిరుచనాపల్లి దొంగలకథలు, మళయాళదేశం పేరుచెప్పితే ఆడమళయాళంకథలు-తప్ప మరేమీ ప్రచారములో లేవు. ఇంతకు మించి ఒకరినిగురించి ఒకరికి తెలియవు. వీరేశలింగంగారివంటి మహనీయులచరిత్ర లిక ప్రచారంగావలెను. భారతదేశంలో బాలబాలికలకందరికి బోధించవలెను. శ్రీ వీరేశలింగంపంతులుగారు స్త్రీలకు ఎట్టి స్వాతంత్ర్యము కావాలనికోరి కృషిచేశారో, అట్టిస్థానం మాదేశంలో-అంటే మళయాళంలో స్త్రీలకున్నదని గర్విస్తున్నాను."

వీరిపిదప శ్రీ గిడుగు సీతాపతిగారు పంతులవారారంభించిన నవ్యాంధ్రవ్యాకరణాన్ని పూరించవలసిన బాధ్యతను హెచ్చరించారు. వారి తరువాత శ్రీ కళ్యాణస్వామిగారు పంతులుగారితో తమకుగల పరిచయ విశేషముల నుగ్గడించిరి. కడపట శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు వీరేశలింగంగారంటే ఏఒక్కడో కాదు. ఆయనే ప్రజ-ప్రజేఆయన-అని తీవ్రముగా నుపన్యసించారు.

ఆ పిదప హైకోర్టుజడ్జి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారి అధ్యక్షతక్రింద వీరేశలింగంగారు రచించిన రెండు ప్రహసనము లనుచెన్నపురి ప్రజానాట్యమండలివారు ప్రదర్శించినారు. ప్రదర్శనములకుపక్రమణగా శ్రీ సత్యనారాయణగారు మాట్లాడుచు నేడొక వీరేశలింగం, వివేకవర్ధని అవసరం అన్నారు. 'హిందూ మహాజనుల మతసభ' 'వినోదతరంగిణి' అనే ప్రదర్శనములు సభ్యుల హర్షధ్వనులు చూరగొన్నవి. వినోదతరంగిణి ఈ కాలమున కన్వయించనిది. తాహశీలుదారు తనభార్య చదువుకోలేదుగాను లంచమును ప్రోత్సహిస్తున్నదన్నాడు. చదువుకున్న పెళ్లాలు నేడేమి చేస్తున్నారు?

## రెండవరోజు ఉత్సవములు

మరునాడు (17 వ తేది) ఉత్సవమున జార్జిటౌనందలి గోఖలేహాలులో జరిగినవి. ప్రాతఃకాలమున గౌ. శ్రీ. రాజమన్నారుగారి అధ్యక్షతక్రింద శ్రీ పంతులుగారి విద్యావైదుష్యములగూర్చి ప్రశంసింపబడినది. శ్రీ స్వామితిల్లావఝుల శివశంకరశాస్త్రిగారు శ్రీ పంతులుగారి కవిత్వతత్త్వమును, రచనాకౌశలమునుగూర్చి చాలవిమర్శనాదృష్టితో నుపన్యసించిరి. ఆ తరువాత అధ్యక్షులు గతనూరేండ్ల ఆంధ్రవాఙ్మయ వ్యాపారమున జమాఖర్చులుకట్టి నిల్వదేల్చిరి. అందు ప్రతాపరుద్రీయము, కన్యాశుల్కము అనునాటకములు శాశ్వతనిధులు అని తెల్పిరి. వారిపిదప శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు, 100సం॥లుగా తెలుగులో వాఙ్మయమున పలుపోకడలగూర్చి విపులముగా నుపన్యసించిరి. కాలవ్యవధిలేమి కుంచించిరిగాని సభ్యులకెంతో హర్షదాయకముగా నుండెను వీరిప్రసంగము. వారివెనుక వరుసగా, డా. గిడుగు సీతాపతి, డా. శ్రీపాద గోపాల కృష్ణమూర్తి, అడవి బాపిరాజుగారు, నిడదవోల్లు వెంకటరావుగారు, వేమూరు విశ్వనాథశర్మ, చిలుకూరి నారాయణరావు గార్లు-తెలుగు నాటకాలు, ఏకాంకికలు, చిన్నకథలు, నవలలు, శాస్త్రవాఙ్మయం, ఆంధ్రభాషాభివృద్ధి అనే

విషయములపై చాలా విపులంగా పండితహర్షజనకముగా ఉపన్యసించారు. అధ్యక్షులైన హరిసర్వోత్తమరావుగారి వందనాలతో ఆసభ ముగిసింది.

మధ్యాహ్నం 3 గం॥లకు తిరిగీ అక్కడే పండితసభ కూడినది. శ్రీ తాపీ ధర్మారావుగారు అధ్యక్షత వహించారు. అధ్యక్షులు తమ తొలిపలుకులలో నన్నయాది ఆంధ్రకవులు తత్పూర్వమున్న ప్రజావాఙ్మయాన్ని చంపి పండితులకై గ్రంథరచన చేశారు. తిరిగీ శ్రీ వీరేశలింగం పంతులుగారు జనసామాన్యం కొరకు ప్రజావాఙ్మయాన్ని సృష్టించారు - అని సోదాహరణముగా ఉపన్యసించినారు. అంత శ్రీ డా. గోవిందరాజుల సుబ్బారావు పంతులుగారు నాటకరంగమును గూర్చి, చిత్తూరి నాగయ్యగారు వెండితెరను గూర్చి, పాతూరి నాగభూషణంగారు గ్రామగ్రంథాల యోద్యమమును గూర్చి, శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు పత్రికారచనమును గురించి, నిడదవోలు వెంకట్రావుగారు తెలుగు ముద్రణ ప్రచురణములగూర్చి ప్రసంగాలు చేశారు. ఆతరువాత స్వర్గంలో 'కవిపండిత సమ్మేళనము'-అని యొక కల్పితవిశేషము ప్రదర్శింపబడినది. శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు, వీరేశలింగం పంతులుగారు, వేదం వేంకట్రాయ శాస్త్రిలుగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు, గురజాడ అప్పారావు పంతులుగారు, కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగార్లు సమావేశమైనారట స్వర్గంలో. వారివద్దకు-శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు పంతులుగారు వీరేశలింగ శతవార్షికోత్సవ సంఘాధ్యక్షులుగా సందేశముగొని రాసశరీరులై వెళ్లినారట. వారి ప్రసంగాలను ఆయా పాత్రలను ధరించినవారు హృద్యమంగా అశువుగా నడిపించారు. ఇక్కడకన్నా అక్కడ వారికెక్కువ సామరస్యం ఏర్పడ్డదనిపించారు. శ్రీ దేవులపల్లివారు వీరేశలింగంగాను, గిడుగు సీతాపతిగారు వేంకట్రాయశాస్త్రిగాను, నిడదవోలు వెంకట్రావుగారు కొక్కొండ పంతులుగాను, చిలుకూరివారు గిడుగు రామమూర్తిగారుగను, తాపీవారు గురజాడవారుగను, మల్లంపల్లివారు కొమర్రాజువారుగను వ్యవహరించారు.

ఆటుపిదప శ్రీ బెజవాడ గోపాలురెడ్డిగారి అధ్యక్షతక్రింద - 'బలాత్కారగాన వినోదప్రహసనము' ప్రదర్శింపబడినది. అందు విప్పన్నపాత్రుని పాత్రధారినందరు కడుంగడు మెచ్చినారు.

# రాజమహేంద్రవరం ఉత్సవం

ఈ ఉత్సవానికి శ్రీ గౌ. రాజా బి. రామకృష్ణరాజుగారు, మద్రాసు కౌన్సిలు అధ్యక్షులు, అధ్యక్షత వహించిరి. శ్రీ అవసరాల రామారావు రాయసం వెంకటశివుడు గార్లు ప్రసంగించిన పిదప శ్రీ రామకృష్ణరాజుగారు పంతులుగారి పటము నావిష్కరించుచు గంభీరోపన్యాసముగావించిరి. ఆ ఛాయాపటము స్థానిక ప్రభుత్వకళాశాల కొసంగబడెను. తర్వాత క్రొవ్విడి లింగరాజుగారు పంతులుగారి సంస్థలన్నిటిని పునరుద్ధరింపవలసిన అగత్యమును వివరించుచు ఉపన్యసించిరి. ప్రార్థన సమాజమునందును, శ్రీ డా. గురుమూర్తిగారి గృహమునను ఏకేశ్వరోపాసనలు జరిగినవి.



# ముఖ సౌందర్యమునకు రెండు క్రీములు అవసరము!






ఒకటి శుభ్రము చేయుటకు-మరియొకటి రక్షించుటకు

పరిపూర్ణమగు లావణ్యము కావాలంటే మీకు రెండు క్రీములు అవసరము. మొదటిది: సున్నితముగా తగుపాళ్లలో కలుపబడి, మాలిన్యమును పారదోలు నూనెలు కలది—పాండ్స్ కోల్డు క్రీమ్. రెండవది: తేలిక, నూనెలేనిది, అదృశ్యముగానుండి పగటివేళ సౌందర్యరక్షణచేయును—పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్.

మీ చర్మమును శుభ్రపరచుటకు పాండ్స్ కోల్డు క్రీమును వాడండి. ప్రతిరాత్రి ఈ మృదువైన క్రీమును మీ ముఖముపైనను, కంఠముపైనను రాసి తేలికగా మర్దించినచో దీనియందలి నూనెలు చర్మగ్రంథులలో ప్రవేశించి అందలి మాలిన్యమును పారదోలును. తరువాత తుడవండి. ఇప్పుడు మీ ముఖము ఎంత పరిశుభ్రముగాను, తేజోవంతముగాను ఉండును!

మీ ముఖసౌందర్యరక్షణకు ప్రతి ఉదయము పాండ్స్ వ్యానిషింగ్ క్రీమునువాడండి. ఈ క్రీము నూనెలేనిది, రాయగానే చర్మములోనికి యింకిపోవును—కాని నిజంగా, రోజంతయు ముఖమునకు ఎండ, వేడి, తగులనివ్వని ఒకపొర వలెనుండును. పాండ్స్‌వారి క్రీమ్ మీ ముఖమునకు పుష్ప సదృశమైన కోమలత్వము నిచ్చును.



తృప్తియుంచుకొనుటకు — మాడ్చివేయునట్టి ఎండాకాలపుటెండవలన, శీతాకాలపుగాలి వలనను, చర్మమునందలి స్వాభావికతైలములు ఎండిపోయి చర్మము బిరుసుగాను, నల్లగాను ఉండును



ఇంకనూ తృప్తియుంచుకొనుటకు — చర్మగ్రంథులలోనికి లోతుగా పోయిన దుమ్ము, మాలిన్యము కనబడే దాక వరకు చర్మవైరూప్యములకు కారణములగుచున్నవి

# పాండ్స్



ప్రతి రోజు పాండ్స్‌వారి రెండు క్రీములను వాడినచో ముఖము మృదువుగాను, తేజోవంతముగాను, లోపరహితముగానుయుండి, ఎల్లప్పుడు యౌవనవంతముగానే యగపడును. ఈ రెండు క్రీములతో మీ ముఖమునకు "సౌందర్యక్రమ శిక్షణ" యొసగుడు—నిత్యము.

వ్యాపార నిర్వాహకులు యల్. డి. సేమూర్ & కం., (ఇండియా) లిమిటెడ్.
బొంబాయి — కలకత్తా — కరాచి — మద్రాసు.

బొంబాయి - కలకత్తా - ఢిల్లి - మద్రాసు - నోవగోవ - కరాచి.

# శ్రీ ధోండో కేశవ కార్వే



శ్రీ ధోండో కేశవ కార్వే మహారాష్ట్రదేశంలో ఒక పేదకుటుంబంలో 18-4-1858న జన్మించాడు. అంటే మనవీరేశలింగంగారు పుట్టిన మరి 10 సం॥లకు పుట్టినాడు. ఆయన దారే త్రొక్కినాడు. ఈశ్వరుడు అవకాశాలు అనుకూలాలు ఇవ్వడంచేత ఆయనకంటే నాలుగడుగులు ముందేవేశారు, సంఘసంస్కరణలో, స్త్రీ విద్యావ్యాపకములో. నేడు 90 సం॥లు నిండగా మహారాష్ట్రదేశం మహావైభవంతో వారి నవతివార్షికోత్సవం చేసింది.

ఆయన పేదబాలుడైనా ఎట్లాగో 1881 నాటికి మెట్రిక్యులేషన్ ప్యాసైనాడు; 1884లో పట్టభద్రుడైనాడు. పిదప బొంబాయి కెథిడ్రల్ స్కూలులో గణితశాస్త్రాధ్యాపకుడైనాడు. ఎం.ఏ చదువుదామనుకున్నాడుగాని త్రాణలేకపోయింది. అయితే బోధనాశక్తిలో పేరుపొందినాడు. అందుచేతనే బాలగంగాధరతిలక్ ఫెర్గూసన్ కళాశాల వదలిన తర్వాత 1891లో ఆయనస్థానే ఈయనను గణితం బోధించను శ్రీ గోకలేగారు నిల్పినారు. మరుసటి సంవత్సరమే ఆయన ఆ కళాశాల పాలకవర్గమైన దక్కన్ విద్యాసంఘములో యావజ్జీవ సభ్యులైనారు. వారాపనిలో 1914 దాకాపనిచేసి చాలించుకున్నారు.

వీరు ప్రథమంనుంచీ సంఘసంస్కరణ పరాయణులు; స్త్రీలయున్నతియందు వీరి కభిలాష. వితంతువుల నుద్ధరింపకోరిక. ఈశ్వరుడున్నూ అనుకూలించినాడు. వీరికి 15 సం॥ననే వివాహంకాగా ఆభార్య 1891లో స్వర్గస్థురాలైనది. రెండేండ్లు ఊరకుండి, 1893లో నొకసద్గృహస్థు వితంతువు కూతురును వివాహమైనాడు. అప్పటికి 19 సం॥ల క్రిందట 1874లో ఒక వితంతూద్వాహమైనదట. అయితే అప్పుడు ఆ దంపతులు పడ్డ కష్టాలుచూచి మరెవ్వరు తిరిగీసాహసించలేదు. ఈ వివాహానంతరం వీరు "స్త్రీపునర్వివాహ ప్రోత్సాహక సంఘము" నజేరి 1895లో దానిపేరు "స్త్రీపునర్వివాహ నిషేధమును తొలిగించు సంఘము" అని మార్పించినారు. వితంతువులందరికి వివాహంచేయాలని కాని వయసుమీరినా వివాహం చేసుకోవచ్చుననిగాని వీరిఅభిప్రాయంకాదు. అయితేవారు గౌరవంగా బ్రతకవలెనని వీరియిష్టము. అందుకు వారికి విద్యావృత్తులు చెప్పించాలని తలచి వితంతుశరణాలయము నొకదానిని, పూనాసమీపంలో హింగ్నిఅనేచోట 1886లో ఏర్పరచినారు. కొంతకాలానికి దీనితోపాటు బాలికాపాఠశాలపెట్టుదామని ఆయనకు తోచింది. మరికొంతకాలానికి ఈ విద్యాసంస్థ నాధారంచేసుకొని మహారాష్ట్ర దేశమంతటా స్త్రీ విద్యావ్యాప్తి గావించగల విశ్వవిద్యాలయముగా దీనినేలమార్చరాదని తట్టినది. 1916 సం॥లో "భారతమహిళా విశ్వవిద్యాలయము" నేర్పరచినారు. దానికి కీ॥ శే॥ రామకృష్ణభండార్కరుగారు అధ్యక్షులు, 1927 ప్రాంతంలో ఇండియా కౌన్సిల్

సభ్యులుగానుండిన పరంజపీగారుపాధ్యక్షులు. చిరకాలము దానికి ప్రజాసహాయమేగాని ప్రభుత్వసహాయము లేదు. 1920 లో విఠల్‌భాయి ఠాకర్ సేగారు 15లక్షల రూ॥లు దీనికి దానమొసర్చి అసలు కదల్చక వడ్డిగావచ్చు రు 52 వేలు మాత్రమే వినియోగింప నిర్ణయించిరి. మరి 15 లక్షలేనాడు ఈ సంస్థసంపాదింపగల్గునో ఆనాడు ఈ 15 లక్షల అసలును సంస్థవినియోగింపవచ్చును అని ఠాకర్సేగారు నిర్ణయించిరి. ఈ 52 వేలేగాక ఇతరత్రాకూడ మరికొన్నివేలు ఆదాయమువచ్చును. ఈవిశ్వవిద్యాలయమునకు 20 సం॥ల క్రిందటికే రు 5 లక్షల విలువగలఆస్తి సంపాదింపబడినది. అప్పటికే దీనియాజమాన్యమున రెండుకళాశాలలు రెండు ఉన్నతపాఠశాలలు, నడుపబడుచుండెను. హింగ్ని, సతారా, బెల్గాం, మాల్వాన్, రత్నగిరి, సంగ్లీ, సూరత్, బరోడా, అహమ్మదాబాదు భావనగర్, బొంబాయి పట్టణాలలో దీనిపెత్తన మంగీకరించిన బాలికాపాఠశాలలు గ్రాంటులు పొందుచున్నవి.

వీరు స్వయముగ పునర్వివాహదంపతులైనను, స్త్రీవిద్యకు నీ సంస్కరణకు ముడిపెట్టక-తమవిద్యాలయమున నున్నంతకాలము ఏబాలవితంతువున్నూ వివాహం చేసుకోరాదని నిర్ణయించినందున పూర్వాచారపరాయణులు నిర్భయముగా తమ బాలికల నీవిద్యాలయముల కంపగల్గిరి. వీరికి స్త్రీవిద్యనుగూర్చి విలక్షణమైన, స్పష్టమైన అభిప్రాయములుగలవు. సరిగవీరీ విశ్వవిద్యాలయము నేర్పరచుకాలమున మెయిరిల్‌బూత్ అను జపానుదేశపు స్త్రీ "19 వ శతాబ్దము-తర్వాత" అనుగ్రంథమున స్త్రీవిద్యావిధానమును గూర్చి చర్చించెను. అవియు వీరిఅభిప్రాయములతో సరిపోయి వీరికి ప్రోత్సాహమొసంగెను.

వీరి స్త్రీవిద్యావిధానమునకు ముఖ్యసూత్రములు రెండు. దేశభాషలో విద్యగరపుట మొదటిది. నేటికి దేశీయప్రభుత్వము లేర్పడి ఈ విధానమునకు వ్యాప్తికల్గుచున్నది. అయిన నింక 5సం॥లకుగాని కళాశాలలలో పూర్తిగా ఆంగ్లము తొలగింపజాలము

మీ అదృష్టము తెలిసికొనుటకు నేడే! రండి!!

ఉదయం 10 గం॥ నుండి సాయంకాలం 4 గం॥ వరకు

సంపూర్ణజాతకము వ్రాయుటకు రు. 10 మాత్రమే. (జాతకము, జాబువ్రాయుకాలం పంపండి.)

త్రికాలవేది, జ్యోతిష్చక్రవర్తి, మహాదైవజ్ఞ

ప్రొఫెసర్. K. ఆంజి

కేసరికుటీరం బిల్డింగు, నెం. 15, వెస్టుకాట్ రోడ్డు, మద్రాసు. 14.

అని 24 న విశ్వవిద్యాలయోపాధ్యాయులు నిన్న మొన్న తీర్మానించినారు. కాని వీరా నాడే ఈ విషయమున నిర్ధారణ మొనర్చిరి. మరిరెండవది స్త్రీలకు సంఘమునగల ప్రత్యేక వ్యక్తిత్వమున కనుగుణ్యమైనదై దానిని పెంపొందించునట్టిదిగా వారివిద్యావిధానముండ దగును - అని ఈ రెంటిని వారాచరణములోనుంచి సత్ఫలితములచూపిరి. స్త్రీ పురుష సమానత్వమన భేదరాహిత్యమని కొన్నాళ్లు భ్రమపడిన పాశ్చాత్యదేశాలలోకూడ శాస్త్రజ్ఞులీ విషయమును ఇటీవల కనుగొనుచున్నారు హేవలక్ ఎల్లిసుఅనునాతు, "స్త్రీ పురుషవర్గములు-సంఘము" అనుగ్రంథమున నిట్లువ్రాసినది :—

"స్త్రీయొక్క ప్రత్యేకనైజము ఆమెయొక్క ప్రత్యేకపు అవసరములు, ఆధిక్యత, గమనించుటవలన కేవలమారోగ్య విషయముననేగాక అంతకుమించిన ప్రయోజనమును కలదు. మంచివో చెడ్డవో, ఆమెకొన్ని అభ్యాసములకు, ఒకవిధమైనశిక్షకు, బద్ధమై యుండుటకు సునిశితమగు ప్రత్యేకప్రాముఖ్యతగలదు. అట్టి ఆమెకు వ్యక్తముగనో అవ్యక్తముగనో, తన (స్త్రీ) జాతినైజముపై అసహ్యతనేర్పిన, ఆమెసహజముగా మగ రాయుడుగామారును. అందువలన ఆమె జీవిత దృక్పథము శాశ్వతముగ వివర్ణమై ప్రత్యేక కార్యాచరణమునందు పెడదారిపట్టును."

వీరీవిధముగా నీ సంస్థలను నడుపుచు నేడు 90 సం॥లు నిండిన పండైయున్నారు. వీరినవతియుత్సవమును శ్రీమతులు డా. సీతాబాయి అన్నెగెరి, ఇందిరాగోకలేగార్లు కార్య దర్శులుగాగల సంఘమువారు అతివైభవముగా జరిపించి-వారికి కొంతధనమును వసూలు కట్నముగా నొసంగియున్నారు.

వీరి 70 సం॥ల యుత్సవమునాడు గాంధీగారు "నిరాడంబరులును, స్వార్థరహితులు నగు సేవాపరాయణులందు అగ్రగణ్యుడు" అని ప్రశంసించియున్నారు.


కుష్ఠు ★ బొల్లి
వగయిరా మేహమచ్చలు, సెగ, సవాయి వ్యాధులకు గ్యారంటీ చికిత్స.
వెంటనే క్యాటలాగుకు వ్రాయుడు :
జి. వి. రెడ్డి, ప్రొప్రయిటరు
బి. రెడ్డి అండ్ కో (రిజిష్టర్డు)
గోపాలపురం. తూ. గో. జిల్లా — వయా. తణుకు. M & S. M. Ry.

## ఇక్కడ … అక్కడ

## మరెక్కడ ?

## ……కేసరికుటీరములో!… …

### ఇక్కడ మైలాపూరులో

ఏమండీ? అబ్బాయి కృష్ణుని వివాహము సంగతి ఎటునిర్ణయించారు తుదకు? వాడేమో రాధనుతప్ప మరేపడచునూ పెండ్లాడనని, ఒకటేపట్టుపట్టినాడు-మీరుజూస్తేనో అఁ హా! కాదు-గూడదు అంటున్నారు - వానికిష్టములేని లలితనే, పెండ్లాడుమనుటలో, అర్థమున్నదా? చెప్పండి. రాధనే కుదుర్చగూడదా? ఈ నిర్బంధ మెందులకండీ!

ఏమో! ఆడుదానవు - ఆర్థికవిషయాలు నీకెట్లు బోధపడతాయి-రాధతండ్రి అష్టదరిద్రుడు - నాలుగువేల కట్నం ఇచ్చే సంబంధము, కాలదన్ని, రాధనే కుదుర్చుమంటావు- వానిచదువుకు, యం.బి. బి.యస్ డిగ్రీకి ఎంతధనంపట్టింది. ఇల్లు గుల్ల చేసుకొన్నానే వానిచదువుకై! పెండ్లి ఖర్చంతా వారేభరించికట్నమిచ్చి - కాళ్లుకడిగి - పిల్లనిస్తూవుంటేనూ రాధా, రాధా, రాధా అని మూర్ఖపు పట్టెందులకే మీకు, తల్లీకొడుకులకు, నోరుమూసుకొనివుండక? నీవు నేర్పేదే వానికంతానూ. "ఇటువినండి. కన్నతల్లిని - వాని సౌఖ్యమే - మన సౌఖ్యము-చదివినవారు, లోకానుభవముగలవారే దుడ్డుకక్కుర్తికిలోనైతే - అబలను-నేనేమి చెప్పగలనండీ మీకు? ఇక మీ ఇష్టము-ఎటూ అబ్బాయిపట్టభద్రుడు వందలకొలది సంపా

### అక్కడ తిరువల్లికేణిలో

'ఏమే! ఏదీ-రాధ - ఏమంటుంది అడిగావా? ఒప్పిందా-లేదా ?' ఇదిగో-వచ్చానండీ కనుక్కొన్నానండీ; చేసుకుంటే, కృష్ణున్నే చేసుకొంటుందట-లేకున్న లేన్నేలేదట. మీరు నిర్ధరించే సంబంధం మాత్రం వలదంటుంది. ఏమిచేయను?

ఆ-ఆ-కృష్ణుడూ! నాలుగువేలకట్నం, ఎక్కడుందట. బుద్ధిలేనియూహాలు - అడియాసలు-నచ్చజెప్పు రాధకుబాగా! వేదమూర్తులు, శామాచార్లు నిశ్చయించిన రాయచూరు దేశాయి రంగారావుకే ఇచ్చేనని.

కాదండీ - నామాటలాలించండి. సమ్మతిలేని సంబంధాలు వలదండీ వలదు. విపరీతపు అనర్థాలకు గురికావలసివస్తుంది, కన్నబిడ్డకదండీ - ఏకధారగా, కన్నీరు విడుస్తూంది అమ్మాయి - జాలివుండనీండీ కొంచం-

ఓస్-నేర్పేదే, నీవు - వేయి రూపాయలు, చేతికి అందిస్తారుగదే - మా కష్టాలు తొలగుతాయి. ఖర్చంతా, వారేభరిస్తారు. పైగా, నలభైతులముల బంగారు నగలు గదే. ఎటూ అవీ - మావేఅనుకో. ఆలోచించు.

క్షమించండి-రామ-రామ - ఈ నీచభావాలూ

ఇక్కడ మైలాపూరులో

దించును; స్త్రీధనాశ ఎందుకండీ. మహాపాప హేతువు-నైచ్యము-అపనింద" "సరిఅట్లనుము. కామూష్ అంటే-ఇంటిలో, అడుగిడుతూనే, అదేగద్దెనా చెడ్డ కేసర-అసహ్యంగావుంది - వినడానికి మీ చర్యలు." అంటూ దిగ్గునలేచి పోయి నాడు రామారావు-పాపము భార్య సీతాదేవి అస్వతంత్ర ఏమిచేయ గలదుమరి. కండ్లనిండ నీళ్లు తెచ్చుకొన్నది - ఇంతలో రామారావు వీధిలో కలుసుకొన్నాడు, డాక్టరు కేసరి గారిని. ఇద్దరూ ఇంటిలోకివచ్చిరి. పెండ్లిసంగతులేమిటని ప్రశ్నించారు. ప్రారంభించింది సీతాబాయి.

"చూడండి, అన్నయ్యా-కృష్ణునకు అసలే ఇష్టము లేదు - మావారు పట్టినపట్టు విడువకున్నారు - ఏలా కుదురుతుంది బాబూ"

మహానుభావులు, డాక్టరుగారు. రామారావుతో తర్కించి - ఒప్పించారు రాధాకృష్ణుల వివాహానికి.

అక్కడ తిరువళ్లి కేణిలో

దురుద్దేశాలూ, ఊహించను, విననూ, సర్వాసహ్యంగా వుంది. ఏమిబ్రతుకది?

ఛీ-భ్రష్టురాలా - ముయ్యి - నోరు నీ ఆటలు సాగవనుకో, ఇచ్చేదే రంగారావు దేశాయికి-అగర్భ శ్రీమంతునకు-రాధను ఇచ్చిందిచ్చిందే. అన్నాడు వెంకటరావు-పద్మావతీదేవి - భార్యనుచూస్తూ, ఎట్టి చూపూ-అబ్బే-భయమేస్తుంది. దిగ్గునలేచి పొయ్యాడు ఆ కోపపురథసములో-పాపము-కట్టిన క్రొత్తదోవతి తలుపుమేకుకు చిక్కి చినిగింది మూరెడంత!

పాపము-పద్మావతీదేవి బొటబొట కన్నీళ్లు విడుస్తూనేవుంది. పరుగునవచ్చింది రాధ పెరటిలోనుంచి. అమ్మా - ఏడ్వకుమే; నా కోసరమేగా-వలదమ్మా-వలదని తల్లిభుజముల పైబడి - వెక్కి వెక్కి ఏడ్చింది.

ఇంతలో దీనజనబంధువులు డాక్టర్ కేసరిగారు వచ్చారు ఈ ఇంటికి. మూడుగంటల వాదోపవాదం. తుదకు నిర్ధారణ - ఏమని? రాధను కృష్ణునకే ఇచ్చునట్లు.

## కేసరి కుటీరములో

అది శ్రావణమాసము; శుద్ధసప్తమి; భానువారము, పెండ్లిపందిరి, పచ్చతోరణాలు బాజాభజంత్రులు-ముత్తైదువుల మధురగీతలు-బ్రాహ్మణుల 'సుముహూర్తా సావధానా సులగ్నా' అని మంత్రాలు, పుష్పమాలాలంకృతులు, వధూవరులు రాధాకృష్ణులు-పెండ్లి పీటలపై నిలబడి ఒండొరుల చూచుకొనుచు, చిరునగువులు నవ్వుచున్నారు. నమస్కరింప బోవుచున్నారు. ఏకకాలమందు, ఎవరికి, శ్రీ యుతులు డాక్టరు కేసరిగారికిని ఇతర పెద్దలకును; ధన్యులు-కృతార్థులు - చిరంజీవులు; ఆపై ఫోటోతీయబడింది. నారికేళ-చందన తాంబూల గంధపుష్ప ఫలాదులు పంచబడినవి. రాత్రిపిండివంటలతోవిందు. ఎంతటి ఆనంద దృశ్యము. ఆదర్శపు వివాహ సంభ్రమము.

కన్నతల్లుల మృదుమధుర హృదయభావములకు-జయీభవ!
కన్నతండ్రుల లోహనిర్మితకఠిన హృదయభావములకు ధిక్కారము.
వరశుల్క-కన్యాశుల్క దురాచారమునకు సంపూర్ణపరాజయము.

వందేమాతరం

గృహలక్ష్మికీ జై

బృంద

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. ఎన్. కేసరి

## మానవసేవ - నా అనుభవములు



మానవసేవ అంటే స్త్రీపురుషులను దుర్మార్గవృత్తులనుండి సన్మార్గములకు మరల్చుటకు చేసేకృషి. వారిలో స్త్రీ సాధారణంగా పొట్టకూటికి లేనప్పుడే తప్పుత్రోవ త్రొక్కును. అదియును కొన్నాళ్లు మాడిమాడి పిదప కక్కుర్తిపడును. కొందరు మానవతులుమాత్రము అట్లే పస్తుండి తుదకు ఆకలిబాధకు తాళలేక ప్రాణత్యాగము చేసుకొనుచున్నారు. పురుషుడో తిండి దండిగ నున్నప్పుడే మదించి చెడుమార్గమునకు తిరుగును. తిండిలేనప్పుడు స్త్రీ వలె అతడుపవాసముల చేయజాలడు. దొంగతనముచేసియైన పొట్ట పూడ్చుకొనును. అందుచేతనే జైళ్లన్నియు దొంగతనముచేసిన పురుషులతో నిండియున్నవి. ఈ విషయమే పురాణములలో విశ్వామిత్రుడు ఆకలికోర్వలేక కుక్కమాంసము దొంగిలించితిన్నట్లు కథలుగా చెప్పబడినది.

కావున స్త్రీ శ్రేయోభిలాషులై స్త్రీలనుద్ధరింప దలచినవారందరును అనాధలకు బ్రతుకుదెరువును చూపించి కాపాడుటయే మానవసేవ. అమాయకులైన కొందరబలలు పురుషుల మాయోపాయములకులోబడి కాలుజారి క్రిందబడెదరు. అట్టివారిని సంఘము బహిష్కరించి కేటాయించుటచే, వారు అన్నోదకములకు ఆదరణకు దూరములవుదురు. ఆ అన్నోదకములకై మరియు తప్పుత్రోవల స్థిరపడిపోదురు. కావున అట్లుజారిపడినవారిని చేయిచ్చి లేవనెత్తి ఆదరించి కాపాడుటే మహోత్కృష్టమైన మానవసేవ.

ఈ పతిత జనోద్ధరణము మనదేశమున కొత్తగాదు. నిష్కారణముగ అపనిందల పాలైనవారిని యుద్ధరించుట అంతకన్న శ్రేష్టమైనది. అహల్యను ఆమెభర్త రాయికమ్మని శపింపగా శ్రీ రామచంద్రమూర్తి ఆమెను కరుణించి శాపవిమోచన మొనర్చెను. సత్యవతియు, కుంతియు — అవివాహితలుగనే సంతానవతులయ్యు — పిదప ఉత్తమ రాజపత్నులు, రాజమాతలునై వర్ధిల్లిరి. సీతను, అపవాద పరితప్తను, భర్తచే అడవిలో విసర్జింపబడినదానిని వాల్మీకి ఆదరించి, పురుడుపోసి, శిశువులను తల్లిని పోషించి తిరిగి వారిని రాముని సన్నిధానమునకు చేర్చియున్నాడు.

"అహల్యా ద్రౌపదీ సీతా తారా మండోదరీ తథా
పంచ కన్యాస్మరేన్నిత్యం మహాపాతకనాశనం"

అన్న పురాణశ్లోకము చాల గంభీరార్థము కలది.

ఇకనిట్లు భ్రమప్రమాదములవల్ల తత్కాలమున అపచారమొనర్చినవారి సంతానమును ఆదరణీయము. అట్టిఆదరణయును ఉత్కృష్టమగు మానవసేవయే. నాగటిచాలున కన్పించిన బాలికను స్వంతకుమార్తెగాపెంచి పెద్దచేసి శివధనస్సువిరిచిన శ్రీ రామచంద్రమూర్తికిచ్చి వివాహమొనర్చిన కర్మయోగి జనకమహారాజు. కర్ణుని పెంచిపెద్దజేసిన రాధయు సూతుడును మానవసేవాపరాయణులే. శకుంతలను సాకిన కణ్వునిదయార్ద్రహృదయము కాళిదాసు వేయివిధముల వర్ణించియున్నాడు. వీరందరట్లాదరింపబడక పోయినచో ఏమైయుందురోకదా ! ఇట్లింకెందరో పురాణములలో చరిత్రలలో కలరు.

## పతిత - క్రీస్తు

పతితపావనత్వమునుగూర్చి బైబిలునందు ఈ విధముగ నొక కథ జోహాను సువార్తలో చెప్పబడియున్నది. (8 వ అధ్యాయము) :

క్రీస్తుధర్మబోధనలచేయుచు పల్లెలు పట్నములు తిరుగుచుండగా యూదులు తమ పూర్వసాంప్రదాయములయందు పట్టుదలవల్లను, ఆయన నూతనప్రేమ సందేశము నవలంబింపదగు సంస్కారములేనందువల్లను-ఆయనను ద్వేషించి వేధింపదలచుచుండిరి. ఒకనాడు ప్రాతఃకాలమున ఆయన సమీపస్థమగు కొండలనుండి యొక పట్నమునకురాగానే కొందరుయూదులు ఆయనకడకొక యౌవనవతిని కొనివచ్చిరి. "స్వామీ, ఈమె వ్యభిచరించుచుండగా పట్టుకొని వచ్చితిమి. పూర్వము మోసెస్ యోగి ఇట్టివారిని రాళ్లతో కొట్టి శిక్షింపుడు అని స్మృతి వ్రాసియున్నాడు. తామేమి శెలవిచ్చెదరు ?" అని అడిగిరి. ఆయన ఏమియుపలుకక నేలపై నేదియోవ్రాయుచుండెనట. ఆమెవిషయమై ఆయన మెత్తబడుచున్నాడు; ఈసాకున నీయనపై నిందమోపవచ్చునని వారు ఉత్సాహవంతులై-గ్రుచ్చిగ్రుచ్చి అడుగసాగిరి. అప్పుడాయన తలయెత్తిచూచి.

"మీలో ఎవరైతే ఎప్పుడున్నూ వ్యభిచరించియుండలేదో, అతడీమెపై మొదట రాయివిసరునుగాక" అనిచెప్పి తిరిగీ తలవంచి వ్రాయసాగెను.

క్రీస్తు మరికొంతసేపటికి తలఎత్తిచూడగా అక్కడ తానును ఆయువతియుతప్ప మరెవ్వరులేక బట్టబయలైయుండెను. అంత క్రీస్తుదేవుడు కరుణారసముప్పొంగ "ఎవ్వరును నిన్నుశిక్షింపలేదా?" అని అడిగెను. "లేదు" అని ఆమెచెప్పగానే "అయితే నేనును శిక్షింపనులే, పో; ఇకపై నిట్లువ్యభిచరించకు" అని సానునయ వాక్యములచెప్పి పంపినాడు.

మానవసేవయే మాధవసేవ యను వాడుకవచన మున్నదిగాని నాఅనుభవములో అది అంతసులభమైన కార్యముకాదు. అనాధస్త్రీలను ఉద్ధరించుటకు కంకణముకట్టుకున్న పుణ్యపురుషులు అపనిందలకులోనుగాక తప్పించుకొనుట చాలకష్టము. దయార్ద్ర హృదయులై పరిశుద్ధాత్మతో అనాధ స్త్రీలను చేరదీసిన రావుబహదూరు వీరేశలింగం పంతులుగారుకూడా ఈదెబ్బ తప్పించుకోజాలరైరి. ఇకసామాన్యులసంగతి చెప్పవలయునా?

ఈ స్త్రీజనోద్ధరణకార్యక్రమమున నిరంతరము స్త్రీలసాహచర్యము మానవసేవా పరాయణులకు తప్పని సరియగును. అందును సంఘబహిష్కారము పొందినవారును, సంఘముచే దూషింపబడువారును కూడ తటస్థించుట కవకాశమున్నది.

పోతన భాగవతమున ఈక్రిందిపద్యము చెప్పబడియున్నది:-

పొలతి దావవహ్ని; పురుషు డాజ్యఘటంబు;
కరుగ కుండరాదు కదిసెనేని
బ్రహ్మయైన కూతు బట్టగ జూచును
వడుగు కింతి పొత్తు వలదు వలదు.

సుమతిశతకమున మరొక పద్యమున్నది:-

"పరసతి సంగతినుండిన
పురుషుడు గాంగేయుడైన భువి నింద పడున్.
పరసతి సుశీలయైనను
పరుసంగతిచేత నిందపాలగు సుమతీ"

ఈరెండును నేను పైనపేర్కొన్న భ్రమ ప్రమాదములు కారణములగుచున్నవి.

ఇట్టి ప్రమాదమునుండి తప్పించగలుగుటకు అనుకూలవతియగుభార్య చాలవరకు రక్షణ కాగలదు. అనుకూలవతియనగా కేవలము పతివ్రత పరాయణయేకాదు. భర్తఉద్దేశ ములను ఆదర్శములను ఉదారబుద్ధితో అర్థముచేసుకొని ఆయనకు ఆకార్యక్రమమున చేదోడు వాదోడుగా నుండగల ఆమెఅని నాఅర్థము. శ్రీవీరేశలింగంగారి విషయమున శ్రీ వెంకటశివుడుగారు వ్రాశినట్లుగా గతసంచికలో నేనుదహరించినవిషయములు ఈ సంగతినే వ్యక్తపరచుచున్నవి. అదియునుగాక ఇట్టి సంస్థలు స్త్రీ పురుషులుకలిసి కృషిచేయుచో, సంసారమువలెనే సక్రమముగా నడువగలవు. ఇందులకు ఉదాహరణముగా నాకు తెలిసిన కొన్ని మానవసేవాసంస్థల విషయమై వివరించి - పిదప నా అనుభవములను కొన్నింటి తెల్పెదను.

## గుంటూరు శారదానికేతనము

ఈ సంస్థకు తల్లిదండ్రులు ఉన్నవ లక్ష్మీబాయమ్మగారును వారిభర్త లక్ష్మీనారాయణ గారున్నూ. వీరిరువురు ఏకమనస్కులై పాటుబడుచున్నారు. ఆదిలో కందుకూరి వీరేశలింగము పంతులుగారితోకూడ పనిచేసి పిమ్మట గుంటూరిలోనే వితంతూద్వాహములు జరిపించినారు. వీరిచేతిమీదుగా గుంటూరులో 35 వితంతువివాహములుజరిపి పుణ్యము గట్టుకొన్నారు. ఆ పిదప నొక బాలికాపాఠశాల నడుపుచు తుదకు దానిని శ్రీ శారదానికేతనముగాస్థాపించి స్త్రీ విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నారు. ఈ నికేతనమును మంచి పునాదులపై నేర్పరచి అనేక అనాధబాలికలకు అన్నము పెట్టుచున్నారు. ఈ విద్యాలయము వీరిచేతిక్రింద దినదినాభివృద్ధి చెందుచున్నది. ఇంకను చెందగలదు. దీనికి నాకు తోచిన ధనసహాయము ప్రారంభమునుండి చేయుచున్నాను.

## ఆంధ్ర మహిళా సభ

చెన్నపురి మహిళాసభను స్థాపించి సర్వశక్తులను సమకూర్చి పెంచిపెద్దచేసిన శ్రీమతి దుర్గాబాయమ్మగారిని ఎల్లరును వేయినోళ్ల పొగడుచున్నారు. ఈ సంస్థకు తల్లియేగాని తండ్రిలేడు. అయితేనేమి ? వేయితలిదండ్రులపెట్టు ఈఒక్క దుర్గాబాయమ్మగారు. ఆడబిడ్డలకు ముఖ్యము తల్లియేకదా ? ఈసభ ఇంతై, అంతై ఇపుడొక బ్రహ్మాండమైనదై, దివ్యతేజముతో ప్రకాశించుచున్నది. ఇందువిద్య గఱపుటయేగాక బ్రతుకు దెఱువు మార్గములనుకూడ నేర్పుచున్నారు. ఇక్కడ ఆడుబిడ్డలకు వసతిగృహమున్నది. ఆటపాటల కనుకూలములున్నవి. బుద్ధిమంతురాండ్రగు గృహలక్ష్ములచేతనే ఈసభ పరిపాలింపబడుచున్నది. అయితే ఇది అనాధశరణాలయం కాదు. ఇది ఉత్సాహవంతురాండ్రగు యువతులు విద్యాబుద్ధులునేర్చి అంతశ్శక్తులను వ్యక్తపరచుటకు అవకాశమిచ్చునట్టిసంస్థ. ఈ సభకును ప్రాధమికావస్థయందు నా శక్తికొలది సహాయమొనర్చియున్నాను.

## హిందూ యువతి శరణాలయం

ఇది మరియొక స్త్రీ చాలకాలముక్రిందట నెలకొల్పిన శరణాలయము. శ్రీమతి యామినీ పూర్ణతిలకమ్మగారు దేవదాసీబిడ్డలకు విద్యాబుద్ధులనుగరపి వారలకులవృత్తినుండి తప్పించి వివాహములుచేసి సంసారులనుగ మార్చుటకు కొందరు బిడ్డలనుచేరదీసి ఈ శరణాలయమును స్థాపించినారు. ఈ శరణాలయం మొదట తిరువళ్లిక్కేణిలో ఒక గల్లీలో నుండెను. ఒకదినమున తిలకమ్మగారు నా వద్దకువచ్చి వారిశరణాలయమును చూచుటకు నన్ను పిలిచెను. నేను మరునాడు అక్కడికివెళ్లి చూచితిని. అప్పుడా శరణాలయము ఒకచిన్నయింటి యందుండెను. అప్పుడు నేను కీలుపాకులో యొకపెద్ద బంగళాతోటను అద్దెకుతీసుకొని ఈ శరణాలయమును అక్కడికి మార్పించితిని. నూలు వడుకుటకు రాట

ములు గుడ్డలు నేయుటకు మగ్గములు వగైరాలు సమకూర్చి తగుమైనసహాయము చేయుచుంటిని. అక్కడి పిల్లలకు చదువు చేతిపనులు నేర్పుచుండిరి. అక్కడి పిల్లకాయలను కేసరికుటీరమునకు పిలుచుకొనివచ్చి తలనూనెలు పళ్లపొడులు, వార్లచేత తయారుచేయించి, ఇంటింటికి తీసుకొనిపోయి విక్రయించు ఏర్పాటున్నూ చేయించితిని. వార్లకు తగుమైన ఉడుపుల కుట్టించి యిచ్చుచుంటిని. వారలు స్వతంత్రముగ జీవించుటకు తగుమైన చేతిపనులను నేర్పించుటకు ప్రయత్నించితిని. అయితే అక్కడిపిల్లలు పెద్దవారై వార్లయిండ్లు చేరుకొనిరి. శరణాలయమును మూయబడెను. తిలకమ్మగారి కుత్సాహము, దీక్షయునున్నను ఆమెకుసరియగు మగతోడు లేకపోవుట మొదటినుండిలోపమే. ప్రస్తుత మామె ఏదోయొకరూపమున తనఉత్సాహముకొలది తాంబరములో యొకచిన్న పాఠశాల నడుపుచున్నట్లున్నది.

## సేవాసదనము

మద్రాసు సేవాసదనము స్థాపించినవారు శ్రీ ముత్తా వెంకట సుబ్బారావుగారును, వారిసతీమణి ఆండాళ్లమ్మగారును. ఈ సంస్థకు వారేతల్లిదండ్రులైయున్నారు. శ్రీ వెంకట సుబ్బారావుగారు మహోన్నత దశలోనుండి ఈ సేవాసదనమును స్థాపించుటవల్ల ఇది గట్టిపునాదితో వర్ధిల్లుచున్నది. ఇందుచదివిన వారందరుకూడ మంచిబ్రతుకు తెరువును సంపాదించుకొని ఆ దంపతులను సదాస్మరించుకొనుచు జీవయాత్ర సలుపుకొనుచున్నారు.

## స్త్రీ సదనము

మద్రాసు స్త్రీ సదనమని యొకశరణాలయముకలదు. పడుపువృత్తియందు జీవించు పడుచులను, భర్తలచే తరుమగొట్టబడిన భార్యలను, అత్తపోరుపడలేక ఇల్లువెడలిపారిపోయివచ్చిన పడుచులను, మరిఇతర అనేకవిధములగు అవస్థలు బాధలు పడలేక సంసారముత్యజించి తరుగెత్తి వీధినపడిన పడుచులను ఈ సదనమువారుచేరదీసి ఆదరించుచున్నారు. ఈ సదనమున విద్య, చేతిపనులు, మొదలైనవాటినినేర్పి జీవించుమార్గములను చూపించుచున్నారు. తగుమైన వరుడు చిక్కిన వివాహమును చేయుచున్నారు. మరియు ప్రభుత్వము వారు పడుపువృత్తిచే జీవించువారిని శిక్షింతురు. అట్టివారి శిక్షానంతరము గౌరవముగా బ్రతుకుటకు బ్రతుకుతెరువునేర్పి క్రమశిక్షణనిచ్చి కాపాడుటకు ఈ సంస్థకు పంపుదురు. అప్పుడు వారికగు ఖర్చులు ప్రభుత్వము భరించును. ఈ విధముగ దీనికి ప్రభుత్వపు గ్రాంటులు వచ్చును. ఈ సంస్థలోని వారిని ఎంతో బందోబస్తుగా అనేక కట్టుదిట్టములతో కాపాడవలసి వస్తున్నది.

## అవ్వై శరణాలయము

శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారును ఈమెభర్త డాక్టరు రెడ్డిగారునుచేరి

ఈ శరణాలయమును సుమారు 18 సం॥ల క్రిందట స్థాపించిరి. వీరిరువురు ఈ సంస్థకు తల్లిదండ్రులై పోషించుచుండిరి. ఇటీవల శ్రీ రెడ్డిగారు కాలగతిచెందినను శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డిగారు వ్యవహారానుభవముగల వారగుటచే దీనిని చక్కగా అభివృద్ధికి తెచ్చినారు. ఇటీవల స్కూలు బిల్డింగు కట్టించుటకై ప్రభుత్వమువల్ల రు 39500 లు గ్రాంటు సంపాదించిరి. ప్రజలవల్ల మరి రు 40000 లు సంపాదింపనుద్యుక్తురాలైయున్నది. ఆదిలో ఇది చిన్నసంస్థయే. ప్రస్తుతం అడయారులో ఇప్పటికే కొన్నిపెద్ద భవనములను కలిగియున్నది.

పేదవారై దిక్కులేక కూడని సహవాసముల దుర్వృత్తులపాలైన స్త్రీలను శిశువులను చేరదీసి చదువుచెప్పి మంచివృత్తులవలంబించు నేర్పరుల నొనర్చి ఉద్ధరించుటయే ఈ సంస్థ ఉద్దేశము. ఈ సంస్థలో తయారైన స్త్రీలు ఉపాధ్యాయినులుగను, దాదులుగను మంత్రసానులుగను, తర్ఫీదునంది బ్రతుకుచున్నారు. ఈ శరణాలయపు పూర్వవిద్యార్థినులు ఇరువదిమంది 1946-47 సం॥న రు 1287-8-0 లను ఈ సంస్థకు విరాళమిచ్చిరనగా వారెట్టి మంచిస్థితి యందున్నదియు తెలుపగలదు. ఈ సం॥న ఈ సంస్థలోని కన్యలేడ్వురకు మంచిగౌరవ కుటుంబములకు చెందిన వరులు లభ్యమై వివాహములైనవని సగర్వముగ వార్షిక నివేదికయందు వ్రాయబడినది. ఈ శరణాలయమునకుకూడ నేను కొంత సహాయముచేసి యున్నాను.

## గొల్లపిల్ల

నేను మంచిస్థితికి వచ్చినప్పుడు గుంటూరు శారదానికేతనమునుండి సంగం లక్ష్మీబాయమ్మ యనునామెను మద్రాసులో చిత్రకళాశాలయందు చదువుకొనుటకు నావద్దకుపంపిరి. ఈమె నాయింటిలోనే భోజనముచేయుచు మూడుసంవత్సరములు కళాశాలలోచదివి ఉత్తీర్ణురాలై యిప్పుడు హైదారాబాదులో విద్యాలయమున రు॥ 150ల వేతనముతో నౌకరినిచేయుచు సుఖముగనున్నది. ఈమెఖద్దరువస్త్రములనే ధరించుచు దేశసేవాభిమానురాలైయుండెను. ఈమెను గొల్లకులమనిన కోపపడును. యాదవులని చెప్పవలయునని కోరుచుండును. అయితే నేను చనువుగ గొల్లపిల్లఅని పిలుచుచుంటిని. అప్పుడామె నవ్వుచుండును. ఈమె బ్రాహ్మణుల యింటిలోయుండి కొన్నికష్టములనుభవించెను. నా మొదటిభార్య ఒంగోలు ప్రాంతపు పల్లెటూరి యిల్లాలు. ఈమె నామేనమామ కుమార్తె. పూర్వాచారములను పట్టుదలగపాటించు ఆచారవంతురాలు. ఈమెకు విద్యసున్నయగుటవలన ప్రపంచవిషయములకు చాలదూరముగనుండెడిది. తులసిపూజ, పంచాక్షరిజపముకానిది గంగకూడ పుచ్చుకొనేదికాదు. కాఫీపలహారము లెరుగదు. ఎప్పుడు పట్టుచీరతోనే కాలముగడుపుచుండెను. చేతతులసిమాల తిరుగుచునేయుండును.

చాలపాతకాలపు భాగ్యశాలి. ద్వాదశిపారణకు బ్రాహ్మణుడు దొరకనినాడు నాకు ఔపోసనవేయుమనిన ప్రొద్దుననే కాఫీతీసుకొని, జాతివాడు పట్టినసోడా త్రాగినవారికి ఔపోసనవేసిన పుణ్యములేదనెను.

ఇటువంటి యిల్లాలి యింటిలో లక్ష్మీబాయమ్మ మూడుసంవత్సరములు కాలము యెట్లుగడిపినది పాఠకులు గ్రహించవచ్చును. ఈమెకు అన్నముపెట్టినపుడు దూరముగ గోడచాటున ఆకువేసి వడ్డించమనేది. ఏకాదశినాడు పండ్లుఫలహారమును చేయునప్పుడు కూడ లక్ష్మీబాయమ్మ చూడకూడదు. తడికాళ్లతో యింటిలోకిరాకూడదు. ఇల్లంతయు శూద్రకూడైనదని విసుగుకొనుచుండును. ఈ వైదికునియింట లక్ష్మీబాయమ్మ మూడు సంవత్సరములు కాలముగడుపుటకు ఆమె అనుసరణ, తెలివితేటలే ముఖ్యకారణములు. ఈమెయే ఇటీవల శారదానికేతనం రజతోత్సవమున అధ్యక్షతవహించియుండెను.

## కంసాలిపిల్ల

ఈపిల్లసేవాసదనమున చదువుకొనుచు మాయింటనివసించుచుండెడిది. సేవాసదనమున కుట్టుపనిలో పరీక్షప్యాసుచేసి విద్యాలయములో యంత్రాయిడరు టీచరుగపని చేయుచు జీవించుచున్నది. ఈమె నాయింటనుండునప్పుడు ఈమెఖర్చులన్నియు నేనే భరించుచుంటిని.

## మంగలిపిల్ల

నేను తిరుచూరులో యున్నప్పుడు నాకు కృష్ణుడనే మంగలి క్షౌరముచేయుచుండెను. వాడికి జానకియను చెల్లెలుకలదు. ఆమెకొంతవరకు ఇంగ్లీషు చదివియుండెను. ఈమెను మద్రాసుకు తీసుకొనిపోయి నర్సుపనిని నేర్పించమని ఆ మంగలి నన్నుకోరెను. నేను దానికి సమ్మతించితిని. నేను మద్రాసుకు వచ్చునపుడు నాతోకూడ ఆమెను పిలుచుకవచ్చి నాయింటవుంచుకొని చదువుచెప్పించి గోషాఆసుపత్రిలోచేర్చి చదివించితిని. ఇక్కడ ట్రెయినింగు ముగిసినపిమ్మట గుంటూరుగవర్నమెంటు హాస్పిటులకుపంపితిని. అక్కడామెయుండగ యొకడాక్టరును వివాహముచేసుకొని ఆరుగురుబిడ్డలతల్లిఅయి సుఖముగనున్నది. ఈమెనాయింట యున్నప్పుడుకూడ యింటిలోనిపోరు తప్పలేదు. మా ఆవిడ గొల్లకూడుపోయి మంగలికూడు వచ్చినదని నన్నుబాధించుచుండెను.

## బోగంపిల్ల

డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి స్థాపించిన అవ్వ అనాథశరణాలయమునుండి వైద్యమును నేర్పించమని యొకస్త్రీని నావద్దకుపంపెను. ఆమెతోకూడ 8 సంllల కుమారుడుండెను. ఈమెదేవదాసి. కొంతకాలము మాయింటనివసించి మంచిఆరోగ్యమును సంపాదించుకొని ఆమెకులవృత్తికి మరలిపోయెను.

## మాలపిల్ల

ఒకమాలపిల్లనుదెచ్చి వైద్యశాలలో కొన్నికార్యములను చేయుటకు నియమించితిని. ఈమెను యింటికితెచ్చునప్పుడు ఈమెజాతిని ఫలానిదని చెప్పకూడదని అనేక విధములుగ బోధించితినిగాని ఆ పిల్లజాతిని మాయింటివారు సులభముగ ఆమెనోటిగుండనే తెలుసుకొని వెంటనే ఆమెను యింటినుండి తరిమివేసి ఇల్లంతయు పుణ్యాహవాచనమును చేయించిరి.

## కాత్యాయిని

గుంటూరు శివాలయములో యేతల్లియో కనిపారవైచిన ఆడశిశువు శారదానికేతనము వారికిలభించెను. వారుశిశువును తీసుకొనిపోయి పెంచుచుండిరి. శివునిప్రసాదమైనందున ఆ బిడ్డకు కాత్యాయినియని పేరుపెట్టి మురుసుకొనుచుండిరి. ఈబిడ్డను నాబిడ్డగ పెంచుటకు శారదానికేతనమువారు నన్నుకోరియుండిరి. ఇందుకునేను సంతోషముతో సమ్మతించి ఆ బిడ్డకులగు ఖర్చును నేనే నిన్నమొన్నటివరకు భరించుచుంటిని. ఆ బిడ్డకు యిప్పుడు 10 సం॥ వయసు. ఆమె చిరంజీవియై లోకారాధనచేయుటకు దేవుని ప్రార్థించుచున్నాను.

ప్రత్యేకముగ అనాధశరణాలయమును స్థాపించి వానిని పరిపాలించు సామర్థ్యము లేకపోవుటవలన కొందరు అనాధస్త్రీలను దగ్గిరదీసి నా వైద్యశాలలోనే బ్రతుకుదెరువు పనులను నేర్పించుచున్నాను. మందులను తయారుచేయుట, మందులను విక్రయించుట, మందులను ప్యాకీచేయుట, తలనూనెలను తయారుచేయుట, నర్సుపనులను నేర్చుకొనుట, గృహలక్ష్మి కార్యాలయమున అచ్చుకూర్చుట మొదలగుపనులను నేర్పించి వార్లకు జీవనాధారమును కలుగచేయుచున్నాను నా సంస్థలో విశేషము పురుషులే పనులు చేయుచుండుటవలన వార్లతోకూడ స్త్రీలుకలసి పనులుచేయునప్పుడు ఆడవారిని అల్లరిపరచుటకూడ సకృతుగా తటస్థించుచున్నది. ఈ కారణమువలన నా ఉద్దేశములకు భంగముకలుగుచుండును. అన్నికార్యములలోను మంచితోకూడ చెడుకూడ అనుసరించియేయుండును.

మొత్తమునకు నా అనుభవముమీదను, ఇతరుల అనుభవము గమనించుటచేతను భార్యాభర్తలన్యోన్య విశ్వాసముకలిగి, సానుభూతితో పనిచేయగలిగినగాని పతితోద్ధారక పూర్వకమగు మానవసేవ కడుకష్టదాయకము; అపనిందలకు మూలము అని నామనస్సునకు స్పష్టమైనది.

కావుననే కాబోలు-అవ్వఅనాధశరణాలయ స్థాపకులు ఆ సంస్థ ప్రణాళికయందలి ప్రథమ సూత్రమునందే—వివేకానందుని ఈ క్రిందివాక్యమును తమ కాదర్శముగాగైకొన్నారు:—

"దిక్కుమాలినవారి నుద్ధరించుట నా మతము; వారి నుద్ధరించుటకై అవసరమైన నరకమునకైన వెళ్లుట నా మతము."

# కేసరీ హైస్కూలు వార్షికోత్సవము



కేసరీ హైస్కూలు వార్షికోత్సవము ఈ 19-4-48 న, కేసరీ హైస్కూలునందు జయప్రదముగా జరిగినది. విద్యాశాఖడైరెక్టరు శ్రీసదాశివరెడ్డిగారు అధ్యక్షత వహించవలసియుండెను. కాని వారు అనివార్యమగు ప్రభుత్వకార్యముండి రాజాలక సందేశమిచ్చి వారిమిత్రులు, లాకాలేజీ అధ్యాపకులు నైన శ్రీ గోవిందరాజులునాయుడుగారిని పంపగా వారధ్యక్షత వహించిరి.

## శ్రీ అల్లాడి కృష్ణస్వామిఅయ్యగారి ఉపన్యాసము

తొలుతగా అధ్యక్షుని ఉపపాదించుచు శ్రీ అల్లాడి కృష్ణస్వామి అయ్యగారు, కేసరీహైస్కూలు కమిటీ అధ్యక్షులు ఇట్లుపన్యసించిరి. హైస్కూలు పూర్వచరిత్రనంతయు విప్పిచెప్పుచు తెలుగుపిల్లలకు తెలుగులో చదువుటకుగల అవకాశములు క్లిష్టముగానుండుటయు, మైలాపూరునందలి సుబ్రహ్మణ్యయ్యర్ హైస్కూలులో ద్విభాషావేదులయిన తమిళోపాధ్యాయులు ప్రభుత్వము వారి దేశభాషలద్వారా బోధనయను విధానమునకు క్రొమ్ముక్కుచెల్లించుటగా వచ్చియురాని తెలుగున చెప్పినపాఠములు పిల్లలకు అంతు పట్టకపోవుటయు మున్నగాగల విషయముల వివరించి పిదప చిరకాలవాంఛతీర మైలాపూరునందలి ఆంధ్రప్రముఖులు తెలుగు ప్రాథమిక పాఠశాలతో ప్రారంభించి లోయర్ సెకండరీస్కూలు స్థితికి తెచ్చి ఆ పైకి పెట్టుటకు శ్రమపడుచుండగా శ్రీ డాక్టరు కే. యస్. కేసరిగారు ఆదుకొని దానిని స్వీకరించి రు, 1,50,000 లు దాకా విరాళము భవనములునిచ్చి ఇట్టిస్థితికి తెచ్చిరనిరి. అంతేకాక గత సం॥ న ఇట్లే సంవత్సరవార్షికోత్సవము జరుగుచున్నసమయమున మరియొక రు 1,00,000, లను ప్రత్యేకముగా కన్యా విద్యాలయమునకై యొసంగిరి. ఇట్లు ఒకరుగా విద్యాలయములకు స్వార్జితమును ఇవ్వనేర్పగలదాతలు అరుదు. వారికుడిచేయి చేయుదానమును ఎడమచేయియు, ఎడమచేయి చేయుదానమును కుడిచేయియు ఎరుగవు. అయితే ఈ హైస్కూలు ఇంకను చాల అభివృద్ధి గాంచవలసియున్నది. శ్రీ కేసరిగారి దాతృత్వము ఎన్నడును దానికి అండయైయేయున్నది. కాని అంతమాత్రముతో తృప్తిపొందరాదు. నేడు ప్రజాప్రభుత్వము రాజ్యముచేయుచున్నది. ఈ ప్రభుత్వము విద్యాప్రబోధము దేశీయభాషలలో జరుగవలయునని ఉత్తరువులు చేసియున్నది. అట్లు దేశీయభాషలలో బోధించుచున్న, అందును అనన్యలబ్ధమగు తెలుగుభాషలో ప్రత్యేకముగ ప్రబోధించుచున్న, హైస్కూలునకు ప్రభుత్వము విరివిగా విరాళమిచ్చి ప్రోత్సహించవలసిన అగత్యమున్నదని స్పష్టముగచెప్పగలను. నాకు ఇతరకార్యములు, దేహారోగ్యము అవకాశమునిచ్చుచో శ్రీ ప్రధానమంత్రిగారికి, శ్రీ విద్యాశాఖా మంత్రిగారికి, శ్రీ ఆర్థికశాఖా మంత్రిగారికి, శ్రీ విద్యాశాఖా డైరెక్టరుగారికి అందరికి నచ్చచెప్పి నా భిక్షాపాత్రమును పట్టుటకు వెనుదీయను. మన అదృష్టవశాత్తు మన ప్రధానమంత్రి తమిళదేశవాసుడైనను తెలుగువారైన రెడ్డికులస్థులు; వారికి తెలుగు భాషాభిమానముండకపోదు. మన ఆర్థికమంత్రియగు శ్రీ గోపాలరెడ్డిగారున్నూ ఈ విషయమున ఉదారస్వభావులు. మన విద్యాశాఖాధికారియు సదాశివరెడ్డిగారు. విద్యామంత్రి తమిళులైనను రాష్ట్రమంతటికి పరిపాలన వహించి, దేశభాషలకు ప్రాముఖ్యత తేవలయునని కంకణముకట్టుకొన్నవారు. కావున తెలుగు భాషాబోధనమొనర్చుచున్న ఈ హైస్కూలును ఆదరింపకపోరు. పైగా ఈ నగరమున ఇట్లు ప్రత్యేకముగా వందలకొలది బాలబాలికలకు తెలుగులో బోధించున్న దిదియొక్కటే. దీనికొసంగు ప్రభుత్వధనము ప్రతిరూకయును సద్వ్యయమగునని

చెప్పగలను. ఈ స్కూలుకమిటీ సమర్థమైనది. ఈకమిటీయందు పూర్వపు హైకోర్టు న్యాయమూర్తులు, ప్రస్తుతపు హైకోర్టున్యాయమూర్తులునున్నారు. నేను వారిఎదుట నిలువవలసినవాడను; నాదేహారోగ్యమునను సరించి వారి అనుమతితోడనే కూర్చుండవలసినవాడను. అయిన వీరున్నకమిటీకి అధ్యక్షతవహించుటకు సాహసించితిని; వారు నన్నందులకు మన్నించిరి. మా కమిటీవారము ప్రభుత్వవిరాళమును సద్వ్యయముచేతుమని వేరుగ చెప్పనక్కరలేదు. ఈ సంగతిని, ఈ విజ్ఞప్తిని విద్యాశాఖ డైరెక్టరుగారికి స్వయముగా ముఖతః నేడు విన్నవించుకోదలచితినిగాని వారు రానవకాశము కల్గినదికాదు. అయినను శ్రీ గోవిందరాజులుగారిద్వారా వారికీవార్త అందునని ఆశించుచున్నాను. శ్రీ కేసరిగారు ఒక లక్షరూపాయలు విరాళమిచ్చి కన్యావిద్యాలయము పెట్టవలసినభారము మామీద పెట్టినారు. ఆ ప్రయత్నములో నేయున్నాము. మా కమిటీ కార్యదర్శి శేషాచలపతిగారు చాలా చురుకైన యువకులు. మమ్ములను పాఠశాలవిషయమై నిద్రపోనివ్వరు. వారు సాధారణముగా ఇట్టి బాధ్యతలనువహించు నైజముగలవారుకాకున్నను, శ్రీ కేసరిగారికిన్నీ వారితండ్రిగారికిన్నీ గల మైత్రిపాటించి ఈ కార్యమునకు పూనుకొన్నారు. ఈ హైస్కూలునకు కుదురై ఇంతటి వితరణచూపి, దీనిని పితృవాత్సల్యమున కనిపెట్టియున్న శ్రీ కేసరిగారికీశ్వరుడు ఆయురారోగ్యములిచ్చి బోషించుగాక.

## గోవిందరాజుల నాయుడుగారు

శ్రీ సదాశివరెడ్డిగారిస్థానే అధ్యక్షత వహించిన శ్రీ గోవిందరాజులు నాయుడుగారు శ్రీ రెడ్డిగారి సందేశమును చదివి వినిపించిరి. దాని సారాంశమిది.:-

## శ్రీ సదాశివ రెడ్డిగారి సందేశము.

వ్రాతమూలకంగానైన, ఇతరులతోపాటు కేసరి హైస్కూలు స్థాపకులను ప్రశంసిస్తాను. ఈ నగరంలోకెల్లా ఇలాంటిది ఒక్కటేఅయిన తెలుగుస్కూలును స్థాపించుటకు వారికికలిగిన ప్రజాహితకరమగు వితరణను మిక్కిలిగా కొనియాడుచున్నాను. అది పుట్టిపెరిగిన ఈ నాలుగేండ్లలోనే, బాలురకేగాక బాలికలకున్నూ అత్యవసరమైన స్కూలుఅని తనఉనికి సార్థకపరచుకొన్నది. సెకండరీ విద్యకొరకు చాలమంది విద్యార్థులు వచ్చుచున్నారు; కావున ఈ స్కూలులో ప్రస్తుతపు విద్యార్థులసంఖ్య రాగల కొలదిసంవత్సరములలో రెండు మూడు రెట్లకుపెరుగవచ్చు. ఇంకనుహెచ్చుగా పాఠశాలస్థలము, దానికనుగుణ్యముగా ఆటస్థలము అత్యవసరముకాగలవు. ఇదిన్నీగాక ఇప్పటికె చాలమంది బాలికలిందు చదువుచున్నారు; కాన వీరికి ప్రత్యేకస్కూలు నేర్పరచుట తప్పనిసరిగానున్నది; విద్యావిషయముగా అది జరుగవలసినపనికూడా. ఇందుకొరకు గతవార్షికోత్సవమునాడే స్థాపకులగు శ్రీ కేసరిగారు లక్షరూపాయలు విరాళమిచ్చిరని వింటిని. ఈ వివేకయుతమైన వితరణ ప్రశంసార్హము. ఇది చాలాగొప్పమొత్తమైనను చాలదు. భవిష్యత్తులో ఈ అవసరములన్నీ తీరునని ఆశించెదను.

శ్రీ కేసరిగారిట్లే ఈ విద్యాలయముల విషయమై వితరణచూపుచుందురని నావిశ్వాసము. అయితే ఈ స్కూలు కమిటీవారికపై నిర్వహించవలసిన పనులుచూడగా ప్రతిఆంధ్రుని సహాయము ఇందుకవసరము. అని నాఅభిప్రాయము. అట్టిసహాయము లభించుగాక. శ్రీ కేసరిగారికి శాంతి సౌఖ్యములు చేకూరుగాక

## కార్యదర్శి నివేదిక

అటుతర్వాత స్కూలుకమిటీ కార్యదర్శి శ్రీ మైదవోలు శేషాచలపతిపంతులు ఎం.ఏ. బి.ఎల్ గారు గతసం॥పు నివేదికను వినిపించిరి. అందలి ముఖ్యాంశములు :—

ఈ సం॥న ఆరవఫారము ప్రారంభింపబడినది; వెనుకటిపద్ధతి ఫలితముగా నీ సం॥న ప్రత్యేకపు అనుమతితో ఆరవఫారమున మాత్రము ఆంగ్లమున బోధజరిగినది. రాగల సం॥నుండి తెలుగులోనే అన్ని తరగతులలో, ఫారములలో బోధజరుగును. 1946-47-న విద్యార్థులసంఖ్య 367; వారిలో బాలికలు 133 మంది; 1947-48 సం॥న విద్యార్థులసంఖ్య 498; వీరిలో 153 మంది బాలికలు. స్థలముండినచో ఇంకను విద్యార్థులను చేర్చుకొని యుండేవారు, 5, 6 ఫారములవారికి ప్రత్యేకవిషయములుగా, (Optional Subjects) గణితము, పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయన శాస్త్రము, చరిత్ర, సంగీతము బోధింపబడుచున్నవి. బాలికలకందరికి సంగీతము నేర్చుటకు ఏర్పాట్లున్నవి. ఎం.ఏ. యల్.టి అయిన హెడ్‌మాస్టరుగాక మరి 4 గు ఎల్.టి లు ఉపాధ్యాయవర్గమున నున్నారు. ఈ సం॥న స్కూలుఫైనల్ పరీక్షకు కూర్చున్నవారు 31 రు.

ఈ సం॥ శాస్త్రవిషయముల బోధించుటకై లాబొరేటరీ, పరికరములు, గ్రంథములు వగైరా రు. 13000 తెచ్చించి కొన్నారు; ప్రభుత్వము ఆచారానుసారము సగమువెచ్చము అచ్చుకొన్నారు. ఈ సంవత్సరము ఇంకను ఈ విషయమై ఖర్చుచేయవలెను. అందుకేర్పాట్లు జరుగుచున్నవి.

గవర్నమెంటువారు గతసం॥న వలెనే కొందరికి స్కాలర్‌షిప్పు లిస్తున్నారు. 28 మంది విద్యార్థులకు ఒకవిధముగాను, 49 మందికి మరియొక విధమునను ప్రభుత్వము వారిసాయమున స్కూలుఫీజు సౌకర్యమేర్పడి యున్నవి. స్థాపకులగు శ్రీ కేసరిగారేర్పరచిన కనకమ్మ స్కాలరు షిప్పులు-24 గురు బాలికలకు ఇవ్వబడుచున్నవి. మంత్రిప్రగడ నరసింహం పంతులుగారి స్కాలరుషిప్పు రు 80/-లు చి॥ యం. పద్మనాభం ఆనేబాలుని కివ్వబడినది. బాలురకేగాక బాలికలకును దేహపరిశ్రమను నేర్పు అర్హతపొందిన అధ్యాపకురాలుకలదు. కమిటీవారు క్రికెటు, ఫుట్‌బాలు ఏర్పాట్లుచేసినారుగాని-తగిన స్థలములేకున్నది. స్కూలుకు ఆటస్థలమునకని భీమన్నపేటలో 6½ ఎకరములు దీర్ఘకాలపు కౌలుపద్ధతిని కమిటీవారు పుచ్చుకున్నారు. ఈ స్కూలులో బాలభటులు, గరల్‌గైడ్సునున్నారు. హిందూస్థాన్ స్కౌట్ అసోసియేషన్ వారేర్పరచు శిబిరములకు వీరును హాజరగుచున్నారు. విద్యార్థులు ఆలిండియా రేడియో బాల కార్యక్రమముల పాల్గొనుచుందురు.

విద్యాబోధకమగు చలనచిత్రములు రెండుసార్లు స్కూలున ప్రదర్శింపబడినవి. క్రాంతి పిక్చర్సు డైరెక్టరుగారైన శ్రీ కాటూరి మోహన్‌గారు ఇందుకుగా R. C. A ప్రొజక్టరు కొనుటకై రు 1000 లు విరాళమును వాగ్దత్తమొనర్చిరి. విద్యాశాఖవారు హైస్కూలును అజమాయిషీచేసి సంతృప్తికరమని తెలివిచ్చినారు. ప్రతిభాపిక్చర్సు డైరెక్టరు శ్రీ ఘంటసాల బలరామయ్యగారు గాంధీమహాత్ముని రంగులచిత్రపటమును హైస్కూలున కొసంగిరి. జూలైలో సెపూర్తిపటము నిత్తుమని వాగ్దానంచేసినారు. గత సం॥న ఇట్టి యుత్సవమునాడు కేసరీ కన్యావిద్యాలయము నేర్పరుప లక్షరూపాయలను శ్రీ కేసరిగారిచ్చియుండిరి. ఈసం॥న స్థలము దొరకక ప్రారంభించచాలరైరి. రాగల సం॥న ప్రారంభింప ప్రయత్నించుచున్నారు. ఆంధ్ర యడ్యుకేషన్ సొసైటీవారు రు 500 లు విరాళమిచ్చిరి.

రిపోర్టుముగించుచు కార్యదర్శిగారు భవిష్యత్తునుగూర్చి చెప్పిన ఈ వాక్యములు గమనార్హములు :—

ప్రభుత్వమువారు ప్రాంతీయభాషలో లేక మాతృభాషలో విద్యాబోధ జరుపవలె నని నిర్ణయించారు. అప్పుడు మాతృభాషలో బోధించుట కేర్పడ్డ ఇట్టిస్కూళ్లుముఖ్య మగును. రాగల సం॥ ము ఇంకా హెచ్చుగా విద్యార్థులువచ్చి ప్రవేశముకోరుతారు. మాకష్టం, స్థలంలేదు. ఆ కొరతతీర్చను కట్టడములు కట్టిస్తున్నాము; దానికి విరాళాలు కోరినాము. రు 25,000 లకుపైగా వాగ్దానాలు, అందులోచాలా మొత్తం వసూలు అయినవి. స్థితిగతులు చక్కబడేకొద్దీ అవసరముపూర్తిగాతీరను పెద్దభవనం కట్టించ వలయునని అభిలాష. ఇదివరలో విజ్ఞప్తి నాలకించినట్లే ధనాఢ్యులైన ఆంధ్రులు ఆదరణ చూపి భవననిధికి విరివిగా విరాళాలివ్వదగునని కోరుతున్నాము.

## గాంధీపటము నావిష్కరించుట.

ఆపిదప వివేకానంద కళాశాల ప్రధానాచార్యులు గాంధీసూత్రకారులు, శ్రీ డి. యస్. శర్మగారు, గాంధీపటము నావిష్కరించుచు గాంధీతత్వమునుగూర్చి విపులముగా నుపన్యసించిరి. (దీనిని విడిగా ప్రచురింతుము.) ఈపటమును వ్రాసినవారు సుప్రసిద్ధాంధ్ర చిత్రకారులు శ్రీచామకూర సత్యనారాయణగారు. గాంధీ నిర్యాణానంతరము వారువ్రాసిన మొదటి గాంధీపటమిదియే. కాన గాంధీ ఘోరమరణము వల్ల కలిగినవారి ఆందోళన మంతయు నీపటమున వెలువడినది.

## శ్రీ గోవిందరాజాచారిగారు.

పిదప శ్రీగోవిందరాజాచారిగారు కమిటీతరపున స్థాపకులగు శ్రీ కేసరీగారి హైస్కూలు స్థాపించిన పూర్వచరిత్రనంతయు పూసగ్రుచ్చినట్లు వివరించి చెప్పిరి. గత సం॥న శ్రీ కేసరీ కన్యావిద్యాలయము నేర్పరుప వారు ఒక్కసారిగా లక్షరూపాయల విరాళము నిచ్చుట నుగ్గడించిరి. స్వార్జితము నట్లుతృణప్రాయముగా దానము చేయగల దాతృత్వం ఎందరికి గలదని ప్రశ్నించిరి.

"జరయమృతములేని జనునట్లుప్రాజ్ఞుండు"

అన్న పద్యమునకు మూలమైన సంస్కృత శ్లోకము నుదహరించి వీరిధనార్జనయు, దాతృత్వమును ఇట్టి ఉత్తమ జీవిత ధర్మపదమునకు చెందినదని ప్రశంసించిరి. శ్రీ కేసరిగారు గృహలక్ష్మి యందుప్రకటించుచున్న "చిన్ననాటి ముచ్చట్లు" లోని చరిత్రాంశములు కొన్నిచదివి నప్పుడు తమకు కన్నీళ్లు వచ్చెననిపల్కి వానిని కొంటి యూటిని వివరించిచెప్పిరి. వారిట్లు ధారాళముగా భూరివిరాళమిచ్చినను విద్యాలయమును తాముప్రారంభింప జాలమికి సిగ్గుచున్నదనిరి. ఈ సం॥ ము ఎట్లైన దానిని ప్రారంభింతుమనిరి.

## చిన్నకథలు- కేసరిగారి కంకితం

ఈస్కూలు నందు ఆరవఫారము చదువుచు ఈ సం॥ ము ప్రభుత్వపు పరీక్షలకు వెళ్లిన విద్యార్థి చిరంజీవి మళ్లపూడి వెంకట్రమణ తనువ్రాసిన చిన్నకథలను శ్రీ కేసరిగారికి అంకితమిచ్చినాడు. ఒక్కకథ చదివి వినిపించినాడు, అతని రచనా చమత్కృతి కందరు మెచ్చినారు.

## శ్రీ కేసరిగారి ప్రత్యుత్తరం.

శ్రీ కేసరిగారు ప్రత్యుత్తరమిచ్చుచు మిత్రులందరు పల్కినప్రశంసా వాక్యములకు తమ కృతజ్ఞత వెలి బుచ్చిరి. గత సం॥న ఆరోగ్యము చెడియున్నందున ఈ సం॥ మీ యుత్సవము చూస్తాననుకోలేదు. అందుచేతనే ఆత్రముతో కన్యావిద్యాలయమున కాదానముచేసితిని. ఇక పైసం॥ మైనను తప్పక బాలికా

పాఠశాల వేరుగా ఏర్పడవలయును. ఈ విద్యాలయములనే దేవాలయములుగను, విద్యార్థులగు బాలబాలికలనే దేవతలుగను భావించి - ఈ దేవాలయములకు అర్చకత్వమొనర్చుచు నాజీవితశేషమును గడుపుట నా ఆశయము. గత సం॥ము తడిచేతులతో వచ్చినాను; ఈ సం॥ము పొడిచేతులతో వచ్చినాను. ఇది అంత హర్షదాయకముగాదు. నేడు మనప్రాంతీయభాషలకు ప్రాముఖ్యమేర్పడుచున్నది. ఇంగ్లీషు పరిపాలనతో పాటు ఇంగ్లీషుభాషకూడా పోతున్నది; పోవలెను. మనభాషబాగా మనపిల్లల కలవడవలెనంటే, మంచిబుద్ధులను మంచికవిత్వములో చెప్పబడిన పోతనభాగవతము ఈ స్కూలు విద్యార్థులకందరికి చదువను అర్థముచేసుకోనురావలెను. సంస్కృత భాగవతముకన్న ఆంధ్రభాగవతము విశేషమైనదని అందరు చెప్పుచున్నారు. అట్టిభాగవతమున ప్రతిసంవత్సరమును ఈ స్కూలు విద్యార్థులను పరీక్షించి అందు ప్రథములైనవారికి నేను ఒక బంగారుపతకమివ్వదలచితిని. మిగతరెండుమూడు స్థానములు వహించువారికి భాగవతగ్రంథమే ఇస్తాను. పూర్వము క్రైస్తవకళాశాలలో బి. ఏ, ప్యాసైవెళ్లు విద్యార్థులకు వారు బైబిలు గ్రంథమును బహుమతిచేసి పంపేవారు. ఈవిద్యాలయమున ఆరవఫారము ప్యాసై వెళ్లువారికి మన మత గ్రంథములగు భాగవతముగాని భగవద్గీతగాని ఇచ్చిపంపుట నాఉద్దేశము. ఇన్నాళ్లున్న మద్రాసు ఆంగ్ల భాషమీద మోహముచే బిడ్డలను కాన్వెంటుస్కూళ్లకు పంపేవారు. అదితొలగిపోయినది. వారికి అప్పటి ఆంగ్లేయప్రభుత్వము అనేకవిధముల సహాయముచేసేవారు. నేడుమన ప్రభుత్వమేర్పడినదికదా. ఇట్టివాని కంతో ధనసహాయముచేసి పోషించవలసినధర్మము వారిపైనున్నది. ఈ సంగతి శ్రీ సదాశివరెడ్డిగారువస్తే వారిసమక్షములో విన్నవింపదలచితిని. శ్రీ గోవిందరాజులుగారు ఈ నా కోరికను వారికితెలుపుతారు. ఒక్కవిషయముచెప్తాను. పూర్వము ఎకరం రు 50 లకే వచ్చేరోజులలో ఇన్ని ఎకరములభూమి ఆటస్థల ముండవలయునని రూలు ఏర్పడియుండును. ఇప్పుడు ధరలు హెచ్చు; స్థలములేదు. ప్రభుత్వమువారే ఊరిమధ్య అక్కడక్కడ ఇట్టిక్రీడాస్థలములేర్పరచిన ఆ చుట్టుప్రక్కల హైస్కూళ్లబాలురు వంతుల ప్రకారమో కలిసియో అక్కడక్రీడలనాడవచ్చునుగదా అని నా అభిప్రాయము.

శ్రీ రెడ్డిగారిస్థానే అధ్యక్షతవహించిన శ్రీ గోవిందరాజులునాయుడుగారు యాదృచ్ఛికముగతమకు ఈఅవకాశము కల్గినందుకు సంతసించుచు-తమ ఆద్యంతోపన్యాసములందు స్కూలుస్థాపకులగు శ్రీ కేసరిగారి వితరణము నుగ్గడించిరి. కమిటీవారి పరిపాలనా సామర్ధ్యమును కొనియాడిరి. కమిటీ అధ్యక్షులు, సభ్యులగు శ్రీ గోవిందరాజాచారిగారు, స్థాపకులు శ్రీ కేసరిగారు తెల్పిన సందేశములను రెడ్డిగారి కందింతుమనిరి. అయితే ఒక్కమాట తాము చెప్పగలమనిరి. రూల్సననుసరించి చేయగల సహాయము నంతయు అధికారులీ పాఠశాలకు చేయుదురని తమవిశ్వాసమనిరి. అయితే ఈస్కూలునందు ప్రత్యేకాభిమాన మెంతయున్నను దీనికై ప్రత్యేకముగా విశేషాదరణ చూపుటకు అవకాశముండదు. కాని చెన్నపురిలో ఈస్కూలు విశిష్టత నిర్వివాదాంశము. కేవలము ప్రభుత్వము మీదనే ఆశలుంచుకొనక ప్రజలున్నూ, అందుముఖ్యముగ ధనవంతులు శ్రీ కేసరిగారిని నాదర్శముగాగొని విరివిగా ధనమిచ్చి దీనినిపోషించవలయుననిరి.

కడపట హెడ్‌మాస్టరు శ్రీ రాజగోపాలరావుగారు అధ్యక్షులకు, సభాసదులకు, గాంధీపటమిచ్చిన బలరామయ్యగారికి, ప్రొజక్టరిచ్చిన కాటూరి మోహన్ గారికి అందరికి, వందనములర్పించుటతో సభ ముగిసినది.

సభాంతమున గిడుగువారి చిన్నబిడ్డలు పాములవాళ్ల వేషాలువేసి ఆడుతుంటే అందరికీ చూడ ముచ్చటైనది. పిదప "వారసులు" అనే ప్రహసనము ప్రదర్శించి "గాంధీజీవితము" ను బుర్రకథ చెప్పినారు. ఈ రెండున్ను విద్యార్థులే గావించిరి.



# శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారికి సత్కారము

* * * *

శ్రీమతి చావలి సీతారామమ్మగారు

1948 ఏప్రిల్ 24, 25 తేదీలలో విశాఖపట్టణం జిల్లా చోడవరం స్త్రీలు సుప్రసిద్ధ నవ్యాంధ్రకవయిత్రి, శ్రీదేవీ భాగవత మహాపురాణ రచయిత్రి, కవితాసమితి కార్యదర్శిని అయిన శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారిని సత్కరించడానికి వారిగ్రామంలో బ్రహ్మాండమైన సభ ఏర్పాటుచేశారు. సభలకు స్త్రీపురుషులెందరో విచ్చేశారు. పండిత శ్రీమాన్ రేపల్లి రామచంద్రశాస్త్రిగారు సభలకు అధ్యక్షత వహించారు. ప్రార్థనానంతరం అధ్యక్షులు కవయిత్రిని సభకు ఎరుకపరుస్తూ ఆమెకవిత్వాన్నీ, గుణగణాల్నీ ప్రశంసిస్తూ దీర్ఘోపన్యాసంచేశారు. అటుపిమ్మట కవయిత్రి తమ కవిత్వం పండిత పామరజన రంజకంగా, సుబోధంగా వుండాలనే వుద్దేశంతో రాస్తున్నాననీ, ఇందుకు తాము రచించిన కావ్యనాటకాదులే కాకుండా శిష్టవ్యవహారపు భాషలో రచించిన శ్రీ దేవీభాగవత మహాపురాణం సాక్ష్యమనీ ముఖ్యంగా తమకథానికలూ మున్నగునవి ప్రజాజీవిత ఉద్దేశ్యాలను ప్రతిబింబింప చేస్తున్నాయనీ, కవిత్వం అమరత్వాన్ని ఇస్తుందనీ, మాయ గురువుల వేషభాషల్లో, శుష్కవేదాంతాలలో స్త్రీలు చిక్కుకొని వృథాగా కాలాన్ని పోగొట్ట కూడదనీ, మహాత్ముని దయవల్ల మనం స్వతంత్రులమయ్యాము కాబట్టి సర్వవిధాలా మనల్ని మనం సంరక్షించుకునే స్థితిలో స్త్రీలోకమే కాకుండా యావద్భారతమూ వుండాలనీ, అలాకానినాడు దేశోపద్రవమూ, ధర్మోపద్రవమూ, తప్పదనీ చెప్తూ స్త్రీలునడుచుకునే విధానాన్ని చక్కగా చర్చించారు. రెండురోజులూ తమ రచనలందలి రసవత్తర భావపూరిత ఘట్టాలను శ్రోత్రానందకరంగా కోయిలగానంచేసి సభికులను తన్మయులుగా చేశారు.

శ్రీమతి చావలి సీతారామమ్మగారు కవయిత్రిని గురించి మాటాడుతూ నేనూ, పొన్నాడ మంగమ్మా మున్నగువారందరు ఆమెమూలంగా కథలూ, వ్యాసాలూ వ్రాయడం మొదలుపెట్టి కృషిచేస్తున్నామనీ, రుక్మిణమ్మగారికవిత్వాన్ని ప్రశంసించడానికి తమకు తాహతుచాలదనీ, ఆమెను ఎంతఘనంగా సత్కరించినా చాలా స్వల్పమే అవుతుందనీ, అనేకవిధాలుగా చెప్తూ కుంకుమబొట్టుపెట్టి నూతన వస్త్రాలతో స్త్రీల పక్షమున రు 116 నూటపదహారు లామెకు సమర్పించారు. ఈసభలకు కారకులూ, శతవృద్ధులూ, స్త్రీవిద్యాభిమానులూ అయిన శ్రీవేపాభీమశంకరం పంతులుగారిని స్త్రీలందరూ ప్రశంసిస్తూ ఆయనకు అభినందనాలు అర్పించారు. అటుపిమ్మట శ్రీరుక్మిణమ్మగారు ఇందుకు కారకులయిన వారినందరినీ ప్రశంసించారు. శ్రీభీమశంకరంగారికి అభివందనములతో సభముగిసినది.

---

# రీటా తల వెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెంట్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనకువేలు వాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు.

రీటా ప్రతిచోటా దొరకును. వెల సీసా 15 అణాలు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

లలితాపావర్ : ఉత్తమమైన హెయిర్‌టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

సుశీల్‌కుమార్ : రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

కన్నాంబ : రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

పుష్పవల్లి : నాకు సుమారు ఏడాదిగా తల వెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్టమైన హెయిర్‌టానిక్ అని నా అభిప్రాయము.

సూర్యకుమారి: రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనము చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

కృష్ణవేణి: రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. తలవెంట్రుకలను రాలకుండాచేసి, కొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

ఆర్. పద్మ: నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

లక్ష్మిబాయి: తలవెండ్రకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

వసుంధరాదేవి: శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజరక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

రాజమ్మ : శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘ వినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్

# చిత్ర ప్రశ్నలు

వి. మనోహరి

1 మానవకోటిలో ధనవంతుఁ డెవ్వఁడు ?
2 జీవన్మృతుఁడు మృతజీవుఁ డెవఁడు ?
4 మరణించి నతనికి, 5 మార్గసునకుఁ దగు
నాత్మబంధుగానరు నవనియందు?

6 శోకవిరహితుఁడు, 7 సుఖవంతుఁడగు టెట్లు?
సకలజనాదరుం డగుట యెట్లు ?
9 ఎల్లలోకంబుల కెవ్వరు దిక్కగు ?
10 దేవలోకంబున కేది తెరవు ?

11 దానములలోన నుత్తమ దానమేది ?
12 వసుధకంతను గౌరవంబగున దెవరు ?
చాకచక్యంబు గలిగిన చాన లెల్ల
చెప్పుకొనరమ్మ మీనేర్పు మెప్పుకొనఁగ.

దశరథాత్మజునామ మైదక్షరములలో
నిమిడి యుండవలయు నింపుగాను
పంచాక్షరములందు ప్రథమతృతీయము
వదలిన షట్చక్రి వర్తియగును

ఐదక్కరములలో మొదటక్కరమువీడి
చెలగి నాల్గక్కరా ల్చేర్చి చదువ
ధర పతివ్రతయగు ద్రౌపతి భర్తకు
నామ మలరుచుండు నయముగాను

చెలగి నైదక్షరంబులు జేర్చి చదువ
పూర్తియైనట్టి యర్థంబు పొందవచ్చు
చాకచక్యంబు గలయట్టి చాన లెల్ల
చెప్పుకొనరమ్మ మీనేర్పు మెప్పుకొనఁగ.


## సౌందర్య రహస్యము

★

## అశోకా ఆమ్ల హెయిర్ ఆయిల్



కేవలము శిరోజాభివృద్ధినే గాక మేథాశక్తి నభివృద్ధిపరచుటలో సాటి లేనిది. మరియు, మెదడునకు చల్లదనము, నేత్రములకు శోభ, ముఖ వర్చస్సును కలిగించును. కురులకు కాంతి, కుదుళ్లకు బలము, తుమ్మెద రెక్కలవంటి నలుపుదనము, పట్టువంటి మృదుత్వమును, మనమున నుల్లాసమును కలిగించు పరిమళము నొసగుటలో గల రహస్యమే మనగా యిర్వ్యాగి, వట్టివేరు, అగరు, చందన, కేతకి, ఆమలక, భృంగబ్రహ్మి మొదలగు పరిమళము, గుణము, రెండును గల ఓషధులను ఉపయోగించి సక్రమపద్ధతులపై అత్యుత్తమ పరిమళ ద్రవ్యములనుచేర్చి తయారు చేయబడినది. గాన, భారతదేశపు నారీమణులేగాక, యితరదేశపు మహిళలు కూడ దీనినే కోరుచున్నారు.




★

**VIJAYA CHEMICAL & TOILET WORKS**
21 & 22, SURIYANARAYANA CHETTY STREET,
RAYAPURAM — MADRAS.



## ఏరు దాటుచున్న సవర స్త్రీలు - పిల్లలు

వీరిని మళ్ళిసవరలంటారు. వీరినివాసం కోరాపుట్ జిల్లాలోని కొండలపైన, వీరిభాష సవరభాష. ఆభాషకు లిపి, వ్యాకరణం తయారుచేసింది స్వర్గీయ గిడుగువెంకటరామమూర్తి పంతులుగారు.]



చిరంజీవి పులిపాక సుగుణా కృష్ణకుమారి.

4 సం॥ బాలిక — డాన్సుబాగాచేస్తుందిట!





## డుడుమా జలపాతం

(భిన్న దృశ్యములు)

[ఈజలపాతం ఎత్తు 540 అడుగులు. ఈజలపాతంవల్ల మత్స్యకుండం ఏర్పడ్డది. ఇది ఓఢ్ర ఆంధ్రసరిహద్దులోనున్నది ఇక్కడనే గొప్ప విద్యుచ్ఛక్తికేంద్రమును - (Hydro-electric scheme) ను మద్రాసు ఓఢ్రప్రభుత్వము లుభయమున్నూ కలిసినడిపిస్తున్నవి. దీనికి రూ. 750,00,000 లవుతుందని అంచనా, దీనివల్ల ఇటు మద్రాసు అటు సి. పి. మరోవంక ఓఢ్ర రాష్ట్రమున - విద్యుచ్ఛక్తి సరఫరా అవును.]



ఆజలపాతమునకు వెళ్లివచ్చే జారుడుదారి - ఎప్పుడూ ఇక్కడవర్షం కురుస్తున్నట్లే ఉంటుంది.

[ఈఛాయాపటముల తీసిపంపినవారు విజయనగరవాసి శ్రీ సి. సీతారాంగారు.]




(మార్చిసంచిక తరువాయి)

24. పల్లేరు: ఏనుగపల్లేరు: పల్లేరుముల్లు యని యందురు. సామాన్యముగ నేల ప్రాకును. పచ్చని పూవులుండును. సమూలముగను, కాయలను, ఔషధములకు ఉపయోగింతురు. సమత్వము, మూత్రసాధకము, బలవర్ధకమునైయున్నది. మూత్రకృచ్ఛ్రమునకును, మూత్రసంబంధమగు సమస్తవ్యాధులకును వాడవచ్చును. చూర్ణంతయారొనర్చి త్రివిధములగు నపుంసకత్వములకుకూడ యివ్వవచ్చును. శుక్లదోషములచే శోషిల్లి, పాండు వర్ణముగలవారికి మిగుల ఉపయోగించును. జనరలు హాస్పిటలులో డాక్టరు కోమన్‌గారు ప్రత్యక్షముగ మూత్రాశయ వ్యాధులయందువాడి మంచిగుణములు పొందినట్లు తెల్పిరి.

25. జటామాంసి:-విలువగల దివ్యౌషధములలో కలియును. కఫవ్యాధులయందును, జీర్ణాశయ పక్వాశయ విరుద్ధ దోషములలోను, బాగుగపనిచేయును. దీనితో టించరు రూపమున తయారొనర్చి ఉదరసంబంధమగు **మహ**త్తరమయిన వ్యాధులపయిన జనరలు హాస్పిటలులో వాడినట్లు డాక్టరు కోమన్‌గారు తెల్పియున్నారు.

26. ఆరెపువ్వు:—ఈ చెట్లు అడవులలో పెరుగును. దీనిపువ్వు సర్వసామాన్యముగ చింతపువ్వువలెయుండును. ఉత్తేజమును కల్గించుస్వభావముగలది. అజీర్ణబేధులకు, ప్రేగులు శీతలము జెందుటవల్లకల్గు భేదులకు, ఆరెపువ్వును చూర్ణించి తడవకు బేడయెత్తు యిచ్చిన నెమ్మదించును. స్త్రీలకు సంభవించు ఋతు, ఆర్తవ, దోషములందు నిస్సందేహముగ వాడనగును. ఆసవారిష్టములయందు దీనిని తప్పకవాడెదరు. నిల్వయుంచుటకు అర్హానుగును. అనుభవ వైద్యవేత్తలు దీనిని పలువిధముల వుపయోగించి ఔషధములు తయారుచేయుచున్నారు.

27. సర్పాక్షి:-సర్వసామాన్యముగ నేలనుప్రాకును. దీని వేరునకుగల బెరడును వూడదీసి చితుకకొట్టి నీళ్లతోనూరి మంచినిమ్మకాయంతవుండలు చేసి ఉదయమున పాలలో వేసి మూడురోజులు యిచ్చిన ఉన్మాదము, పిచ్చి అపస్మారములను తగ్గించును.
మద్రాసు పిచ్చిఆసుపత్రి సూపరింటెండెంటుగారు వాడినట్లు తెల్పియున్నారు.

* * *

1. అద్భుతమైన నల్లులమందు:—ఎండుమిరపకాయలను మెత్తగపొడిచేసి నీళ్లలోకలిపి తేర్లునట్లు కషాయమునుకాచి వడియగట్టవలయును. ఈ వడియగట్టిన కషాయములో కొద్దిగ కర్పూరతైలమునుగాని కిరసనాయిలును (Kerosine oil) గాని చేర్చి వాడవలయును. పుల్లకుగుడ్డచుట్టి మిరపకాయ కషాయములోముంచి నల్లులుగల స్థళమున తడిపిన నల్లులువాటిగుడ్లు నశించును.

2. నోటికంపునకు మందు:—నల్లకాచు 7 డ్రాములు (7 Drams), సన్నలవంగపట్ట పొడి 40 గురిగింజలెత్తు (40 Grs), తెల్ల చక్కెర 3 ఔన్సులు (3 ounces), లవంగముల తైలము 4 బొట్లు.
పైనచెప్పిన వస్తువులను వేరువేరుగ సన్నగచూర్ణమునుచేసి వస్త్రకాళితమునుపట్టి అన్నిటిని యొకటిగకలిపి మరల మెత్తగనూరి లవంగముల తైలమునుకలిపి నూరవలయును. మాత్రపక్వమగుటకు కొన్నిబొట్లు పన్నీరునువేసి నూరవలయును. కందిగింజ పరిమాణముగల మాత్రలనుచేసి నీడనయెండబెట్టి బుడ్డిలోవేసుకొని వాడుకొనవలయును.

పాత్రుడుగారి
బాలసంజీవిని (Regd)
పిల్లల లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులను నివారించును.
డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు అండ్ బ్రదర్స్,
11, దక్షిణ మాడవీధి, మైలాపూరు, మదరాసు.
కుంభకోణము బ్రాంచి : 1. సారంగపాణి కోవిల, తూర్పువీధి.
తిరుచినాపల్లి బ్రాంచి : 15 పుగళియపిళ్లైవీధి, తెప్పకుళం. P. O.
అన్ని మందుల షాపులలోను దొరకును.

# ఇంటిపనులలో మెళుకువలు

## మానసిక వ్యాధులు—దిగులు

శ్రీమతి సరస్వతి చెన్న కేశవన్‌గారు ఎం. ఏ.

మన వ్యావహారిక జీవితంలో ఎన్నో రకములైన వ్యాధులను కనుచున్నాము; వినుచున్నాము. శారీరకమైన వ్యాధులు చాలామట్టుకు మనకు తెలిసేవున్నాయి. ఔషధ సేవవలన వీటిని బాగుచేయగలము. అయితే వీటిని మానసికవ్యాధులు అని చెప్పను వీలుకాదు. శరీరము ఆరోగ్యముగా వున్నా, మనస్సునకు ఆరోగ్యము అంటే సమాధానము లేకపోతే, పలురకము లైనటువంటి మానసికవ్యాధులు బయలుదేరుతాయి. ఈ వ్యాధులకు మందులు, మూలికలు కావు. సమాజమునందు లోటు వుండబట్టియో లేక ఇంటిపరిస్థితులు సరిగా లేక పోబట్టియో ఈవ్యాధులు వుత్పత్తి అవుతూ వుంటాయి. కనుక వీటిని సరిదిద్దుటయే వీటికి మందు.

మానసికవ్యాధులు అంటే మొట్టమొదట మనకు తోచునది విపరీతమైన పిచ్చి, వెఱ్ఱి. ఇవి మానసిక వ్యాధు లన్నింటిలో చాలా హానికరమైనవి. ఇవి వ్యక్తియొక్క పూర్తి మానసికబలమును సహజత్వమును నిర్మూలించి ఆవ్యక్తి తన దినచర్యలకు సంఘజీవితమునకు పనికిరానివానినిగాచేసి వేయుచున్నవి. తాను, ఫలానా వ్యక్తి, అన్న చేతనత్వముకూడా లేకుండా జేయుచున్నది. అయితే కంటి కగమ్యమై చూచువారికి సాధారణముగా కనబడినను అనుభవించువారికి బాగా అర్థమగుచూ, వ్యాధిగానున్ననూ, అట్లు, పరిగణింపబడకపోవు మానసికవ్యాధులు అనేకములున్నాయి. వీటికే నరముల బలహీనతవలన కలుగువ్యాధులు అంటారు. ఇటీవల వైద్యులు, మానసిక శాస్త్రజ్ఞులుకూడాకలసి చేసిన కృషివలన నరముల బలహీనత అంటూ ఒకటి లేదనియు, ఇవన్నీకూడా, మనస్సునకు సంబంధించిన వ్యాధులనియు నిర్ధారణ చేయబడినది.

వీటన్నిటిలో, దిగులు, ఒకముఖ్యమైనవ్యాధి. ఇదియే మూడురకాలుగా, పరిణమిస్తుంది. మొట్టమొదటి స్థితిలో ఏదో ఒకలాంటి పేరులేని దిగులుగా కనబడును. చిన్నపిల్లలలో ఇది సాధారణంగా కనబడుతుంది. సహజంగా దిగులు, భయము అనునవి వున్నటులుండి ఏదేని పెద్దధ్వని అకారణమైనది విన్నచో కలుగుచున్నదని శాస్త్రజ్ఞుల, అభిప్రాయము. ఇవి, వ్యక్తి నరముల పటుత్వమును అనుసరించి కొద్దిగనో, గొప్పగనో కలుగుచుంటాయి. దీనిఫలితము చిన్నపిల్లలు తమ వాగ్ధోరణియందు కనబరచుచుంటారు. దిగులుపడిన కొందరుపిల్లలు అపరిమితమైన మితభాషులుగా నుంటారు. మరికొందరు మెత్తగా గుసగుసలాడునట్లు మాట్లాడుతారు. మరికొందరు నత్తినత్తిగా మాట్లాడుచూ, వారిదిగులును కనబరచు చుందురు. ఈవిధముగా దిగులునొందిన పిల్లలు రాత్రిళ్లు సరిగా నిద్రపోక, పండ్లుకొరకటం, పొర్లటం, నిద్రలోలేచి నడవటం ఈప్రకారంగా చేస్తూవుంటారు. ఇవియే దిగులునకు ముఖ్యమైన గురుతులు.

ఈ దిగులునకు కారణం తెలిసికోవటం చాలాముఖ్యము. లేకపోతే చికిత్సచేయుడానికి వీలులేదు. పిల్లలు తమ అసహాయస్థితివలన చాలాభయస్థు లగుదురు. ఇది సహజము. ఈ సహజభయమే మానసికవ్యాధియైన దిగులుకు కారణం అనటం అపసవ్యము. సర్వకాల సర్వావస్థలయందును పిల్లలు దిగులుపడుటకు కారణములు వేరువున్నాయి. అందులో ముఖ్యమైనది తల్లిబిడ్డల సహవాసము. తల్లిప్రేమ సహజము. కానీ, ఒకప్పుడు అధికముగనుండి పిల్లవాని వ్యక్తిత్వమునుకూడా రూపుమాపును. మరియొకప్పుడు ఏమియూలేక

పిల్లవానిని దారము తెగిన గాలిపటమువలె వదలివేయుటయు నిజమైన తల్లిప్రేమకాదు. ఇట్లు తల్లిదండ్రులపై ఆధారపడు బిడ్డకు వున్నటులుండి ఆ ఆధారమును తీసివేసిన వానికి ఈ దిగులు కలుగుటలో ఆశ్చర్యమేమియు లేదు. ఈస్థితి ప్రథమ కాన్పుపిల్లలకు సాధారణంగా సంభవిస్తుంది. అంతవరకు ఇంటిలో ఏకపుత్రుడై తల్లిదండ్రుల ఆదరణలో పెరుగుపిల్లవాడు, వున్నటులుండి, మరియొక బిడ్డ ఇంటిలో జన్మించుట వలన తనముఖ్యస్థానము కోల్పోవును. తన హక్కు అని ఇదివరకు ఎంచినప్రేమ, ఆదరణ మరియొకరికి చెందడముతో పిల్లవానికి నిస్పృహ, వానితోపాటు దిగులుకలుగుతుంది. గడుసుబిడ్డడైన, దీనికి ఫలితముగా, ఆ చంటిబిడ్డకు హానికలుగజేయును. అట్లు లేనిబిడ్డ క్రమేణ దిగులుకు లోనయిపోవును.

ఇదియే కాక వేరు కారణముల వలనకూడా, ఈదిగులు కలుగుటకలదు. ఇంట్లో తల్లివద్దనో లేక తండ్రివద్దనో, అపరిమితమైన భయముకలిగిన వారి శిక్షకు భయపడుటతో ప్రారంభించి, ప్రతిదానికి దిగులుపడుచుందురు. అట్లులేక, ఇంకా కొంతవయస్సు వచ్చినపిల్లలు, తమ సంఘవాతావరణానికి, నైతికంగానో లేక ఆర్థికంగానో సరిపడకపోవటంచేత, ఈ దిగులు కలుగుచున్నది.

చాలా చిన్నబిడ్డగా నున్నప్పుడే, ఈ కారణంలేని దిగులు సామాన్యంగా కనబడుచుండును. దీనికి తరువాత మెట్టు కొంత పెద్దవారయిన పిల్లలు. వీరిలో బుద్ధికుశలతలు వృద్ధిపొంది వుంటాయి. కాబట్టి ఈవిధమైన అకారణమైనభయము, పరిహాసాస్పదమనియు, వృథావ్యథ అనియు గ్రహించెదరు. కాని, భయము, దిగులు కూడా వుండడమువలన వారు తమకు తెలియకనే ఈగుణములను కేంద్రీకరించి, ఏదేని ఒకప్రత్యేక విషయమున దీనిని వెలుపరచుచుందురు. మిగతా విషయాల్లో, సహజముగానున్నను, వారు విభ్రములై యుంటారు. ఈ కేంద్రీకరణంకూడా రెండు విధములుగా జరుగవచ్చును. ఒకానొక మానసిక శాస్త్రజ్ఞుడి మతప్రకారము, శారీరక మార్పువలననే రసోత్పాదన మవుతున్నదనియు, రసోత్పాదనమువలన శారీరక మార్పులు కలుగుననియు కలదు. అంటే ఈలాంటి పిల్లలయందు, భయము, రసముగా మరిగిపోవును. కానీ దీని ననుసరించి కలుగు శారీరక భయచిహ్నములు మాత్రము ప్రబలముగా, కనబడును. రాత్రులలో భయానక సంఘటనలను కలల్లోగాంచి, ఆ భయాన్నిమరచి, నిద్రలేచి "గుండెల్లో బరువు అనియో" లేక, "వూపిరిఆడటం లేదనియో" బాధపడడం స్మృతితప్పిపడిపోవుట, సంభవిస్తుంది. అటువంటప్పుడు చూచువారికి పిల్లవానికి ఏదో శారీరకమైన జబ్బుకలదను భావమేకలుగును. ఈ విధంగా పలుమారులు జరగటంవలన, తప్పనిసరి, శారీరకవ్యాధికూడా కలుగుట అసంభవముకాదు.

ఈ కేంద్రీకరణమే, మరియొకవిధంగా ప్రకటింపబడవచ్చును. ఏదైన ప్రత్యేకవిషయం అనుభవానికి వచ్చునపుడు మాత్రమే వీరు ఎక్కువగా భయపడుచుందురు. కొంతమంది పిల్లలకు పిల్లులంటే భయం. కొందరికి కుక్కలంటే భయం, కొందరికి బల్లులు చీమలు అంటే భయం. ఇవి చిన్నప్పుడు సహజమైనా పెద్దపెరిగి బుద్ధివచ్చినతరువాతకూడా వుంటే అసహజమై, మానసికవ్యాధిగా మారిపోతుంది.

అయితే ఇల్లాంటి దిగులుకు మందు లేదా అని అడుగవచ్చును. శారీరకవ్యాధుల వలెనే వీటికికూడా చికిత్స అవసరము, కలదు కూడాను. శాస్త్రములను చదివినంతనే కార్యము ముగియదు. వాటిని ప్రయోజనకారులను చేయవలసినది కూడా ముఖ్యమే. మానసికశాస్త్రము, ఇప్పుడిప్పుడే వృద్ధినొందుచున్న శాస్త్రశాఖ. కనుక, వీనిని ప్రయోజనకారిగా చేయుటకు ఇప్పుడే ప్రయత్నములు జరుగుచున్నవి.

మొట్టమొదట, ఈవ్యాధుల కన్నిటికి ముఖ్యంగా గమనించవలసినది ఇతరులతో పిల్లలకుండు సంబంధము. అంటే తలితండ్రులో, ఉపాధ్యాయులో లేక కూడనుండు సహాధ్యాయులో వీరందరుకూడా ఆ పిల్లవానితో సహజంగా నడుచుకొనవలెను. అధికమైన ప్రేమగానీ, క్రోధంగానీ, మత్సరముగానీ చూపరాదు. అట్లుచేసిన ఈ అధికత్వమువలన కలుగుదిగులుకు కారణంలేదని చూపించి నమ్మించవచ్చును. కానీ ఈలాంటి నమ్మకమున్న పిల్లలుకూడ కొన్నిసమయాల్లో వారి దిగులుమానరు. అటువంటప్పుడు దీనికని ప్రత్యేకముగ ఏర్పరచియున్న వైద్యశాలలందు శారీరక మానసిక చికిత్సలు చేయించవలెను.

ఈ దిగులు కేంద్రీకరణమై వున్నపుడు దాని మూలకారణము కనిపెట్టి చికిత్సచేయుటమంచిది చాలమందికి ఇది మెదడు ఎక్కువగా పనిచేయుటవలన కలుగుచున్నది కాన అటువంటిపనులను మాన్పించవలె నంటారు. అది నిజముగాదు. దీనికి కారణము రసపూరితములైన ద్వంద్వభావములే కాని వేరుకాదు. ప్రేమ, క్రోధము, మత్సరము కరుణ, ఇల్లాంటివి ఢీకొన్నప్పుడే ఈ మానసికవ్యాధి కలగడం కనుక ఈ మూలకారణ నిర్మూలనము ముఖ్యము. దీనికికూడా శాస్త్రజ్ఞుల సహాయ్యము పొందుటయే సురక్షితమైన మార్గము.

(A I. R. అనుమతిని.)




అరుణ స్త్రీలకు వరప్రసాదం 'వంటిది. ఇది స్త్రీలకు కలిగే ఋతు సంబంధ వ్యాధులన్నిటిని పారద్రోలి జీవనమునకు ఆనందమును, మాధుర్యమును, సౌరభ్యమును చేకూర్చును.

ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్, మదరాసు 17.





## ఆవాల పెరుగుపచ్చడి

ఆవాలను, మిరపకాయలను, ఉప్పును బండమీద మెత్తగ పచ్చడివలెనూరి పెరుగులోకలిపి, మామిడిముక్కలనుగాని, దోసముక్కలనుగాని కలిపి, తిరగమాత వేయవలెను.

## ఉల్లిగడ్డ పెరుగుపచ్చడి

ఎర్రఉల్లిగడ్డలు పచ్చిముక్కలుగ నఱికిగాని, వాడ్చిగాని పెరుగులో కలిపి, ఉప్పు పచ్చిమిరపకాయముక్కలు కొత్తిమిరివేసి ఆవాలను తాళించవలయును.

## ముల్లంగి పెరుగుపచ్చడి

ముల్లంగి పచ్చడిని కూడా, ఉల్లిగడ్డల పచ్చడివలెనే చేయవలయును. ముల్లంగి వుల్లిగడ్డలను చేర్చి కూడా చేయవచ్చును. కారట్టుదుంపలను కూడా యిటులనే చేయవలయును.

## కొతిమిరిఆకు పెరుగుపచ్చడి

కొతిమిరాకును, పచ్చిమిరపకాయలను సన్నగాతరిగి ఉప్పుతో కూడ పెరుగులో కలిపి తాళించి వాడెదరు. ఇదితరుచుగ మద్రాసు అరవహోటలులలో చేసి వాడెదరు.

## కర్పూరవల్లిఆకు పెరుగుపచ్చడి

కర్పూరవల్లిఆకు అనగా ఓమంవాసన వచ్చు దళసరిగను, గరుకుగను యుండు గుండ్రటి ఆకు. దీనిని తోటలలోను, దొడ్లలోను, పూదోట్లలోను వేసి పెంచి అప్పుడప్పుడు బిడ్డల జబ్బులకు వాడెదరు.

అజీర్ణములకు, జలుబు, దగ్గువగైరా కఫసంబంధమైన వ్యాధులకు ఆకును వాడ్చి రసమును పిండి వాడెదరు. పచ్చి ఆకుకూడ నమిలిన కారముగ నుండును. ఈపచ్చడిని చలికాలమున ఆరోగ్యమునకు వాడెదరు.

కర్పూరవల్లి ఆకులను తీసికొని వాటికి తగిన ఉప్పు, మిరియములుగాని మిరపకాయలుగాని కలిపి నూరి పెరుగులోకలిపి వాడుకొనవచ్చును.

## ఆపిల్ పండు పెరుగుపచ్చడి

ఆపిల్ పండ్లపై చెక్కుతీసి సన్నముక్కలు తరిగిగాని తురిమిగాని పెరుగులోకలిపి, ఉప్పు పచ్చిమిరపకాయలు, కొతిమిరివేసి తాళించి అన్నములో భుజించిన రుచిగనుండును.

## పనసపండు పెరుగుపచ్చడి

పనసపండ్ల తొళలలోని గింజలను తీసివేసి, తొళలను సన్నముక్కలుగ కత్తితో నరికి పెరుగులోకలిపి, మామూలుగ ఉప్పు, కారము కొతిమిరి వేసి వాడుకొన వలయును.



# బ్రతుకు తెరువు



మాగృహలక్ష్మి మార్చిసంచికలో చక్కెరపాకులు అన్నివిధముల తయారు చేయుటను గూర్చి విశదముగ తెల్పియుంటిమి. పదార్థములు మధురముగ నుండుటకు తయారొనర్చు పానకములు-(Syrups) పలువిధములు.

### 1 నిల్వవుంచుకొనుటకు తయారుచేయు విధానము

ఎనామలుపాత్రలో చక్కెర, నీళ్లు లోగడ చెప్పియుండు భాగములనే పోయుము. మూతయుంచుము. పొయ్యిమీద నుంచుము. బాగాకరుగునట్లు చూడుము. అయిదు నిమిషములుకాచుము. పై పొంగునుతీసివేయుము. గడ్డలుకట్టకుండునట్లు చూడుము. పొంగిపోకుండాకాచుము. దింపిచల్లారనిమ్ము. అటుపిమ్మట సుమారు వకచిటికెడు నిమ్మఉప్పునువేయుము. అట్టిదానిని సీసాలయందు జాగ్రత్తచేయుము. ఇట్టిషరబత్‌తోటి యిష్టమయిన సువాసనలు చేర్చవచ్చును.

### 2 పైపూతకు పనికివచ్చు సిరపు

అరపౌను చక్కెర 2½ ఔన్సులు నీళ్లు, నిమ్మవుప్పు వకచిటికెడువేసి కాచవలయును. అటుపిమ్మట సిరపురంగుగ వుండవలయునన్న యిష్టము వచ్చినరంగును కల్పుకొనుడు. వేడిగనుండగనే పాత్రలలోనింపుడు. అవసరమయినప్పుడు ఆపాత్రను వేడి నీళ్లలోయుంచిన కరగును. అట్టిదానిని ఉపయోగించనగును.

### 3. Crystallizing Syrups—

వకపౌను చక్కెర 10 ఔన్సులు నీళ్లలోకల్పి, కరుగనిచ్చి కాచవలయును. పైకివచ్చు నురుగును తీసివేయుము. తయారయినతర్వాత తడికాగితముతో మూసివుంచుము. ఉపయోగించుకొనుటకుముందు సిరప్‌పైననుండు మురికినితీసివేసి crystals గా వుండుదానిని వాడుకొనవచ్చును.

మామిడిపండ్ల మురబ్బాలు తదితరమైనఫలములతో తయారొనర్చుకొని నిల్వ యుంచుకొనుటకు సర్వసామాన్యమయిన విధానములు:—

మామిడి, బేరిపండు, సీమరేగుపండు, గుమ్మడికాయ, ముల్లంగి మొదలగు గట్టి పదార్థములు కలిగియుండుపండ్లను సేకరించవలయును. వీనితో మురబ్బాలు తయారొనర్చుట కడు సులభము. ఉత్తమము. మురబ్బాలుగ తయారొనర్చుపండ్లు సంపూర్తిగా పండియుండ కూడదు. పండుకు వచ్చినకాయలు శ్రేష్టము. అట్టివానిని ముందుగ బాగుగశుభ్రము చేసి అనగా కడిగితుడువవలయును. తొడిమెలుండుచోట్ల గుడ్డతోతుడిచి శుభ్రముచేయ వలయును. అటుపిమ్మట పండ్లపైనుండు పచ్చనితోలును వీలయినంత జాగ్రత్తగా చాకుతో

తీయవలయును. పచ్చనితోలు సంపూర్తిగ విడిపోవునట్లు చూడవలయును. అట్టిపండ్లు పదార్థనిర్ణయము ప్రకారము ముక్కలు ముక్కలుగా తరగవలయును.

మామిడిపండ్లను నాలుగు చెక్కలుగా కోయవలయును. మధ్యనున్న టెంకను (ముట్టెను) తీసివేయవలయును. కోయగా వచ్చిననాలుగు చెక్కలను కత్తితో విడిపోకుండునట్లు కోయవలయును. ఇట్టిముక్కలలో పులుపుపోవుటకు వీటిని సున్నపు తేటలో వేయవలయును. పులుపులేనట్టి పండ్లకు యిట్టిపద్ధతి అనవసరము.

వెడల్పాటిపాత్రలో ముక్కలను వుంచవలయును. ముక్కలు వకదానిపై మరొకటి పడకుండునట్లు చూడవలయును. అప్పుడు వంటకము చేయవచ్చును.

ఒకవేళ పానకము రంగుగానున్నచో, మురబ్బాలుకూడ రంగుగనే తయారగును. అట్టివాటికి, లవంగంవాసన యిష్టమయినయెడల చేర్చవచ్చును. అట్టివాసనలు యిష్టము లేనియెడల మామూలు మిఠాయిరంగునే వాడవచ్చును. పానకముతోటి ఉడుకునప్పుడే రంగుసామాన్యముగా యేర్పడునుగాన కల్పితరంగును స్వల్పముగానే వాడుటమంచిది. మరియు కొందరు పండ్లను పాత్రలోవేయకముందే పానకమునందే రంగులుకల్పుకొనెదరు. పాత్రలోవేసినపండ్లను పానకము నెమ్మదిగాకలియుటకు పొయ్యిక్రిందమంటను తగ్గించి చేయవలయును. నీటిచేనిండియుండు గుమ్మడి, ముల్లంగి బాగుగపండియున్నచో పానకము చేరికచే చిక్కపడి స్ఫటికరూపముదాల్చి అందముగానుండును. మరియు మూడుపాళ్లు పానకమును పాత్రలోనుంచితీసిన దానిలో పాతికభాగములో పండ్లనువుంచిననూ బాగుండును.

తదితరములగు జాములు, జెల్లీలూకూడా యీపద్ధతిపైననే తయారగును.

ఇకముందు అంటుమామిడి సంబంధమైనపండ్లతో మురబ్బాలుచేయుటను కొద్ది మార్పులతో వివరించబడును.


## ఆగిపోయిన బహిష్టులు (TABLETS)

కుమారి (మాత్రలు) ఆగిపోయిన బహిష్టులను సక్రమంచేయును. ముమ్ముందు అలాంటి ఇబ్బంది రాకుండా చేయును. త్వరితకాలంలో నిరపాయకరమైన ఫలితాలనిచ్చును. వేలమంది సంతృప్తులైరి.

సమస్తవ్యాధులకు మాత్రల వెల రు. 3-0-0.

మొండివ్యాధులకు ప్రత్యేకమైన మందు వెల రు. 5-0-0

నివారణకాక జీర్ణించియుండు వ్యాధులకు మందు వెల రు.8-0-0 (వి.పి. 12 అణాలు అదనం.)

**Mrs. P. DEVEE** F. D. S. (G. L.)

Tollygunge :: CALCUTTA.

*Stockists:—*

హోరి & సన్సు, 93, చైనాబజారు రోడ్డు, మదరాసు.

# సోమపాట (ద్విపద)

వంగోలు వెంకట్రంగయ్యపంతులుగారు, బి.ఏ., బియల్.

(సేకరించి పంపినది)

సోమంబు[47] దంచవలె సకియ యీరాత్రి
సమయాన నిలుజేర జని మరలుదము
గోరింటచేతుల[48] కొమ్మలందరము;
పేరంట్రమని పెద్దవారల బిలుము;
పసపు కుంకుమ లిచ్చి పడతులందఱికి
కుసుమ పీఠంబుల గొబ్బునసిమ్ము;
ముత్తెదువులు మనము ముదముమీరగను
ఎత్తిపాడుచు దంచ నేర్పడ రమ్ము.
సువ్వి సురనాథ[49] సువ్వి సువ్వనగ
సువ్వి సవనత్రయ[50] సంపూజనీయ
సువ్వి వైశ్వానర సువ్వి యజ్ఞేశ

* * *

యజ్ఞరూపుడ వైన యజ్ఞేశ నీకు

* * *

అగ్నిరూపమున నీవంతట నిండి
అమరియున్నట్టి యమరేశ సువ్వి
కామకులైనట్టి[51] సోమయాజులకు
కామంబు[52] లన్నియు కరుణతోనిమ్ము.

* * *

కర్మరూపుండవై కర్మములందు
కరమున నిల్చిన యజ్ఞేశ సువ్వి
వేదములందున[53] నుదయంబు నీకు
వేదవేదుల యిండ్ల వెలసియుందువు
వేదవేదియులేని వేదహీనులకును

* * *



కానగరానట్టి యజ్ఞేశ సువ్వి

* * *

సువ్వి[54] ఖాండవదాహ సువ్విసర్వేశ
సువ్వికామేశ్వర సువ్విసువ్వనుచు
సువ్వియజ్ఞాధార సువ్వి నీకనుచు
సువ్విస్వాహా స్వధా[55] సుదతి నీభార్య
సువ్విచతుర్వేద సూతి సువ్వనుచు
యజ్ఞపురుషుని పేరు యెత్తిపాడుచును

* * *

తరుణి యీ సోమంబు దంచగావలెను
అసురులు సురులును[56] యంబుధిదరువ

*　　　*　　　*

అమృతంబుకై సోము[57]డపు డుద్భవించె

*　　　*　　　*

పుట్టగానే జూచి పట్టంబు గట్టి
పట్టుగా[58] నోషధ్లు బాలింపుమనిరి.
రాజుగా సోమంబు రక్షింపు సోమ
రాజను పేరట రంజిల్లుచుండు.
కద్రుసుపర్ణులు[59] కయ్యంబు సేయ
కద్రులు తాగెల్చి గాయత్రి గనిరి.
భాసురంబగు సోము[60] భూమిపై నిలుప
దాసురాలైన మాతల్లిని పిలుతు

అనిన[61] గాయత్రియా యజ[62] తోడ గెల్చి
చనె దివ్యలోకంబు చెలువుమీరగను.
మూడు[63] దినంబులు మఱువుగ నుండ
ముదితయందునగాదె మూడురాత్రిళ్లు
క్రయ[64]మైన సోమంబు గోవ్యము జేసి
దయమీర[65] దాతురు ధరణిదేవతలు.
వేల్పులను దలచి వెలదులు గోర
నల్వురు[66] గంధర్వులను యంత దలచె.
వాణిని[67] గోవుగా యింతిగావించి
వాణికిచ్చినవాడు సోమంబు దెచ్చె.
అవనియందునగాదె యధిక సోమగును.
గోవు[68] దక్షిణ జేసి వనితను జూడు
ఈరీతి పుడమిని ఈసోమరాజు
నారీశిరోమణి నలుదిశల్నెగడె.

---

47 సోమమునుదంచుట = దీనిని సోమాభిషవం అందురు. అగ్నిష్టోమమున సోమరసహోమము ముఖ్య వ్యాపారము. రెండవదినమున సోమక్రయణము అనగా సోమలతను కొనుక్కొనుట అను వ్యాపారముజరుగును. నాల్గవదినమురాత్రి తెల్లవారుజామున ముత్తైదువులు ఆ సోమలతను (ఈ కాలమున దాని ప్రత్యామ్నాయమగు పూతికను) దంచుదురు. దంచునపుడు ఈ సోమపాటను పాడుదురు. ఈ అభిషవక్రియను అధ్వర్యు డుపక్రమించును. తరువాత ముత్తైదువులు దంచుదురు.

48 గోరింటచేతుల కొమ్మలందరము = సౌమంగల్య లక్షణము-అందరు ముత్తైదువులని సూచింపను.

49 సువ్వి = దంచునపుడగు అనుకరణధ్వని.

50 సవనత్రయము = ప్రాతస్సవనము - మాధ్యందిన సవనము-తృతీయసవనము. ఇవి సోమయాగమునకు అంగములు.

51, 52 కొందరు యజ్ఞాదులను స్వర్గకాములై చేయుదురు. కొందరిష్టకార్యార్థసాధనకొరకుచేయుదురు. విశ్వామిత్రాదులు కేవలముగ సిద్ధికొరకు యజ్ఞముల జేసిరి.

"అహం నియమమాతిష్ఠే సిద్ధ్యర్థం పురుషర్షభ"

(రామాయణము బాలకాండ 19-4) దశరథుడు పుత్రార్థము పుత్రకామేష్టి జేసినటులున్నది.

53 .........భారత వనపర్వము.

54 ఖాండవదాహము = అగ్నిదేవు డర్జునుని సహాయమున ఖాండవవనదహము చేసిన గాథ మహాభారతాదిపర్వమున గలదు.

55 స్వాహా, స్వధా = అగ్నిదేవుని భార్యలు.

“స్వాహాంతు దక్షిణేపార్శ్వే దేవీంవామే స్వధాం తథా” (ఔపాసన మంత్రములు.)

56+57 (i) “ఆ రత్నాకరంబున సుధాకరుం డుద్భవించునటుల’ భాగవతము 8.264

ii తతశ్శత సహస్రాంశుర్మథ్యమానాత్తు సాగరాత్ ।
ప్రసన్నాత్మా సము త్పన్నస్సోమః శీతాంశు రుజ్వలః ॥

భారతము ఆదిపర్వము. అ. 18.

..........

59, 60-68 కద్రూశ్చైవ సువర్ణీ చాత్మరూపయో రస్పర్ధేతాగ్ సా కద్రూ స్సుపర్ణ మజయత్. తైత్తిరీయ సంహిత 6-16 దీనిలో 1-2-4 చూడుడు.

(N. B ఈ అనువాకము దీర్ఘముగనున్నందున దానినంతయు ఇందుదాహరింపలేదు. ఈ నోటులోని యంశము లాయనువాకమున నున్నవి.)



## కఱవు

శ్రీ కోలహాల వెంకట్రామమ్మ ఈవెంకటనరసమ్మ, సోదరీద్వయం

పసిబిడ్డ ఆకటిబాధ తీర్చుటకునై
  వ్యభిచరించెడి పతివ్రత విపత్తు
పురిటిలోపల నన్నమునకు లేకకృశించి
  యంతమాచున్న బాలెంతకూయి
గోచిగుడ్డకునేని నోచుకోలేక మా
నమునకు బ్రగ్గు ననాధయేడ్పు
ఎంగిళులను సంగ్రహింపఁ గుక్కలతోడఁ
  గలహించు కుంటి గ్రుడ్డుల యవస్థ
కుక్కిమంచానఁ గూలి మూల్గుచును మందు
మాకు లందింపఁగల దిక్కులేక, కడుపు
చెఱువుగానేడ్చు నిర్భాగ్యజీవి వెతను
దలఁచి కొనినంత హృదయము జలదరించు.

—:o:—

# దాక్షిణాత్య కవయిత్రి - రామభద్రాంబ



శ్రీ నిడదవోలు వెంకటరావుగారు ఎం. ఏ.

సాహితీ భోజుడు తంజావూరి రఘునాథరాయుని కాలములో (క్రీ. శ. 16 14-1633) విలసిల్లిన ప్రఖ్యాత కవయిత్రి రామభద్రాంబ. ఈమె రచించిన గ్రంథములలో సంస్కృతమున "రఘునాథాభ్యుదయము" అనునదిమాత్రము లభ్యమై ప్రకటితమైనది. (మదరాసు విశ్వవిద్యాలయము - ప్రాచ్యపరిశోధనాలయము సంస్కృతశాఖా ప్రచురణములు - సంఖ్య 2) తెలుగుగ్రంథము లేమియు లభింపలేదు. అయిన నీమె తెలుగు కవయిత్రియని విజయరాఘవనాయకుని కాలమున నున్న చెంగల్వ కాళకవిరచితమైన రాజగోపాల విలాసము నందలి యీక్రింది పద్యమువలన తెలియుచున్నది. విజయరాఘవనాయకుడు కాళకవి కవిత్వమును ప్రశంసించుచు చెప్పిన పద్యము:-

ఘటికాశతగ్రంథ ఘటనోత్కట నవీన
　　పాండిత్యగరిమలు భళియనంగ
నోష్ఠ్యనిరోష్ఠ్యాది కోద్దామ రసగర్భ
　　సందర్భమానని సన్నుతింప
మాకందమంజరీ మధురఝరీ మాధుర్య
　　రచనావిశేష మహారా యనంగ
పరిహృతేతరయుక్తి భాగ నూతనకథా
　　చాతుర్య ధుర్యత సన్నుతింప
అయ్యదినమున రామభద్రాంబవారు
నేడు "కృష్ణాజి" కవితచే నేర్పుమెఱసి
కవితసేయుట లెల్ల మీఘనతగాదె
కవివినుతచర్య చెంగళ్వ కాళనార్య!

(రాజగోపాల విలాసావతారిక. ముద్రితము; తంజావూరి పుస్తక భాండాగారము. సంఖ్య 222.)

పైపద్యము వలన చెంగల్వ కాళకవి రామభద్రాంబ గురువనియు, ఆమె తెలుగు కవిత్వ మాతని యనుగ్రహము వలననే చెప్ప నేర్చినదనియు మనము గ్రహింప వలయును - తెలుగున నీమె కవిత్వము గానరాక పోయినను, సంస్కృతకవిత్వ మందీమె యతిప్రాసలు మొదలగు ప్రత్యేక తెలుగుభాషా కవిత్వలక్షణములు పాటించుటచే నీమె తెలుగు కవయిత్రియే యని చెప్పనగును. మచ్చునకు

కటాక్షశాతా కరుణా రసోన్మయే
న కేవలం తే నతతాపహారిణః
ప్రవర్ధయంతే ఫలభార సంగతః
సమస్త సంపత్ సవలీశ్చ సంతతమ్.

దశత్రప్రసూనాంకిత దామసౌరభీ
ర్మిళన్మిళిందారవ మేదురోదరామ్
సలీలలాస్యాక్రమ చంక్రమోచిత
.... .... .... పరాగ భాసురామ్
ద్వాదశస్సర్గము.

ఈ రఘునాథాభ్యుదయ కావ్యమున సుగృహీత నాముడగు తంజాపూరి రఘునాథనాయకుని చరిత్ర వర్ణితమైనది. రాజాస్థానమున రాజసన్నిధానమున మెలగిన విద్వత్కవయిత్రి రచనమగుటచేత కేవల సాహిత్య విషయమునకేగాక చారిత్రకముగ నీగ్రంథ ముపాథేయమైనది. కావుననే విజయనగర సామ్రాజ్య చరిత్రకారులు, తమ చారిత్రకసాధనములలో నీగ్రంథము నొకముఖ్యసాధనముగ క్రీ. శ. 1917 లో గుర్తించిరి.

**(sources of Vijianagar History. S. K. Iyengar. 1917).**

ఈసంస్కృతకావ్యమున 12 సర్గలు గలవు. ప్రతిసర్గాంతమున గద్యగలదు. ఇందులో 900 శ్లోకములు గలవు. తృతీయ, దశమైకాదశ సర్గాంతములలో శార్దూల వృత్తములు మాలిని, ద్వాదశమున స్రగ్ధరయు గలవు. తక్కిన భాగముల యందెల్ల రఘువంశమువలె నొకే వృత్తము వాడబడినది. ఇదియు రఘునాథుని చరిత్రగావున రఘువంశమును రామభద్రాంబ యాదర్శముగ గొనియుండును.

రఘునాథాభ్యుదయము. సర్గలవిషయములు: ప్రథమసర్గ-చోళదేశవర్ణనము 2. తంజాపుర వర్ణనము 3. రఘునాథనాయక వర్ణనము 4. రఘునాథుని దినచర్య-కమలావిలాసము 5 సభావర్ణనము 6. రఘునాథుని వంశావళి 7. రఘునాథుడు, యువరాజు, వివాహము, తుండీరదేశజయము 8. చోళగుని జయము 9. నేపాళ జాఫ్నాజయము 10 పాండ్యరాజుల జయములు 11, 12. రఘునాథరాయుని కాలమున స్త్రీవిద్య-స్త్రీలసంస్కారము సంగీతవిద్య, రావణ హస్తము, నాటకరచన, రాగములు, నృత్యములు, వాని విశేషములు చెప్పబడినవి. ఈసర్గయంతయు జదువదగినది.

ఇందలిగద్య:-

ఇతి శ్రీరామభద్ర కరుణాకటాక్ష లబ్ధ సారస్వత ప్రవర్ధమాన శతలేఖినీ సమసమయలేఖినీ యాష్టభాషాకల్పిత చతుర్విధ కవితానుప్రాణిత సాహిత్య సామ్రాజ్య భద్రపీఠారూఢ రామభద్రాంబా విరచితే రఘునాథాభ్యుదయే ప్రథమస్సర్గః

ఇట్లేయన్ని సర్గలయంతమందు గద్యల నూహించుకొనునది.

ఈక్రింది సమస్యను రామభద్రాంబ అశ్వాశువుగా పూరించినది.

రఘునాథుడు: "కింతే సంతాన పాదపాయంతే"

రామభద్రాంబ: కతికతినః క్షితిపతయః
కింతే రఘునాథ నాయకాయంతే
భువి బహవః కిల తరవః
కింతే సంతాన పాదపాయంతే.

రసవత్కవితాసామ్రాజ్య భద్రపీఠాదిరూఢ యగు రామభద్రాంబ కావ్యము తెలుగుభాషాపఠలోనికి ననువదించిన నామె వైదుషీ విశేషమింకను ప్రస్ఫుటము కాగలదు.



Telephone No. 2422
,, 2863—2446

Telegrams : 'PLEASURE'

బెంగుళూరులోనా?

# శాస్త్రీస్ హోటల్‌లో బసచెయ్యండి

హోటల్ బృందావన్, హైగ్రౌండ్స్ హోటల్, రేస్‌కోర్సు యెదుట,
బెంగుళూరులో ఇదే అతి దర్జాయైన గొప్ప హోటలు ;

బస చేయదగినది. పేరుకు తగ్గ ప్రాశస్త్యముగలది ఇదొక్కటే. ఒకసారి వచ్చి చూడదగినది.



నవీనమయిన అన్ని ఏర్పాట్లతోను, సౌకర్యములతోను అలరారు ఉత్తమ తరగతికి చెందిన గొప్ప వసతిగృహమిది. సువిశాలమయిన, బాగుగా గాలివచ్చునట్టి గదులు, స్నానములకు ప్రత్యేక గదులు, అతి నవీనమగు శానిటరీ ఏర్పాట్లును గలవు,

ఫోన్ 2422

బ్రాంచ్:

శాస్త్రీస్ హోటల్, చిక్‌పేట్, బెంగుళూరు సిటీ,

చాలా మితమయిన రేట్లకు బాగుగా అన్నిసౌకర్యములు అమరియున్న విశాలమయిన గాలిగల గదులు. ఆంధ్రభోజనము ఒక ప్రత్యేక విశేషము.

ఇది చదవండి:

దివాన్ బహదూర్ డి. శ్రీరామశాస్త్రిగారు, ఎమ్. ఎల్., విశాఖపట్టణము, ఇలావ్రాశారు:

గతనెల 22 నుండి 24 వ తేదీవరకు మీబృందావనం హోటలులో బసచేసియుండిన నేనున్నూ మెసానిక్ అతిథులుగ వచ్చిన యితర మిత్రులున్ను ఇందుమూలముగా మా సంతృప్తిని, సంతోషమును మీకు తెలియపరచుచున్నాము. మేమున్న కొద్దిరోజులున్ను మీనౌకర్లు మాయెడల అతిశ్రద్ధ ఆదరణచూపియుండిరి. మా అవసరములన్నింటిని జాగ్రత్తగా అమర్చియుండిరి మాకిచ్చినగదులు పరిశుభ్రముగానుండెను. భోజన ఫలహారాదులు సంతుష్టికరముగను రుచ్యముగనుండెను. మీహోటలుకు సర్వసౌభాగ్య అభివృద్ధులను కోరెదను.

ఆంధ్రుల నవీన సర్వజనామోదమందిన హోటలు

శాస్త్రీస్ హోటల్, చిక్ పేట్, బెంగుళూరుసిటీ వారి నిర్వహణక్రింద ప్రారంభింపబడినది.

# లోకవార్తలు

బ్రిటిషు దేశంలో అసోసియేటెడ్ బ్రిటిషుఫిలిమ్సు అనే ఒక ఫిల్ముకంపెనీయున్నది, దానికిప్పటికి 21 సం॥లు. యింతవఱకు 250 ఫిల్ములనుతీసిరి, వాటినన్నిటిని వరుసగాయుంచితే 1,02,500 మైళ్ళపొడవు అవుతుంది.

♦ ♦ ♦

వ్యవసాయము చేయడానికి క్రొత్తగా యంత్రసామగ్రిఉపయోగిస్తే సౌకర్యమని మనవాళ్ళంటున్నారు. ఇదిఏయింత సౌకర్యమోచూడండి. గోధుమవెన్నులను కోయడము, నూర్చడం, ఆ ధాన్యమును పిండిచేయడం ఆపిండిని రొట్టెచేసి కాల్చడం, అన్నిపనులు 40 ని. 5 సె. లలో చేయడానికి వీలైన యంత్రసామగ్రిని బ్రిటన్‌లో కనిపెట్టారు.

♦ ♦ ♦

లండనులో క్యూగార్డన్సు అని ఒక ఉద్యానవనమున్నది. దానివైశాల్యం 288 ఎకరాలు. అందులో 25,000 వివిధరకములైన మొక్కలున్నవి. వీనిని మొట్టమొదట ఏర్పాటుచేసినదిమూడవజార్జిరాజుతల్లి అగస్టారాణి. యిది 1759 లో జరిగింది.

♦ ♦ ♦

భూమియొక్క సాంద్రత నీటిసాంద్రత కంటె అయిదున్నరరెట్లు ఎక్కువ.

♦ ♦ ♦

లండనునగరం ప్రపంచంలోకల్లా వజ్రాల వర్తకానికి కేంద్రము. 1946లో అక్కడ అమ్మకమైన వజ్రాల విలువ 1,10,00,000 పౌ.

♦ ♦ ♦ ♦

బ్రిటిష్ రాజకుమారి ఎలిజబెత్తు వివాహమునకు తిరునల్వేలి గరల్‌గైడ్సుఅసోసియేషన్‌వారుపంపిన ఎంబ్రాయిడరీ చేరుమాళ్ళకు సంతసించి వారికి తన సంతోషమును తెలియపర్చుచు ఆమె యుత్తరం వ్రాసినది.

♦ ♦ ♦

రష్యాలో యుద్ధకాలమందు పెరిగినవస్తువులధరలను ప్రభుత్వం క్రమంగాతగ్గిస్తున్నది. ఈ మధ్యసిగరెట్లు, చిన్నమోటారుకారులు, అంగరాగములు, ఫోటోకెమెరాలు, దూరదర్శనపు అద్దాలు, కుట్టుయంత్ర

ములు, రేడియో సెట్లు వీటన్నిటిమీద 100 కి 10 వంతులు ధరలు తగ్గింపబడినవి. సైకిళ్ళు మోటారుసైకిళ్ళు మీద 100 కి 20 వంతులు తగ్గించారు.

♦ ♦ ♦

ఈ ఏప్రిల్ 15 తారీఖున న్యూఢిల్లీ నగరంలో డా. బి. ఆర్. అంబేద్కర్ గార్కి డా. లక్ష్మీకబీర్ కన్యకు వివాహముజరిగినది. వరుడు భారతయూనియన్ ప్రభుత్వమున న్యాయశాఖమంత్రి. వధువుబొంబాయిలో వైద్యవృత్తి అవలంబించిన నారీమణి. ఈ వివాహము డిల్లీ డెప్యూటి కమీషనర్ సమక్షమున సివిల్ మ్యారేజి చట్టము ననుసరించి జరిగినది. పెండ్లికొడుకు వయస్సు?

♦ ♦ ♦

ఆంగ్లచక్రవర్తి కుమార్తెయగు మార్గరెట్ 17 సంవత్సరముల యువతికిని 27 సం॥ల వయస్సుకలిగిన డెన్మార్కు రాజకుమారునికిని ప్రధానం జరిగినట్లు వదంతులు తెలియవచ్చుచున్నవి. ఇవన్నియు అసత్యములని రాజకుమారుడు, రాజకుటుంబస్నేహితుడు తెలియ పఱచిరి. యింతకుపూర్వముకూడ రుమేనియారాజగు మైకేలుతోను, మిలేఫర్డుహేలెన్ రాజుతోను, లార్డుడెర్బీతోను ప్రధానంజరిగినట్లు వరుసగా వదంతులు పుట్టియుండెను.

♦ ♦ ♦ ♦

పూర్వము మనదేశపుస్త్రీలు బిడ్డలకు తల్లిపాలు చాలకపోయిన పాలు ఎక్కువగానున్న స్త్రీల వద్ద తమబిడ్డలకు పాలు యిప్పించుచుండిరి. కాని లండనులో ఎక్కువపాలున్న తల్లులవద్ద ప్రభుత్వమువారే సేకరించి దానిని వైద్యశాలలకుగొంపోయి, వైద్యులచేత పరీక్షజేయించి వాటిలో రోగక్రిములు లేకుండా చూచి, వానిరుచిని, బలమునుకనిపెట్టి, అపాలను సీసాలలోపోసి ద్రవముగానో లేక ఎండునటుల (నీరులేకుండా) చేసి బిళ్లలుగానో నిలువయుంచెదరు. (తిరిగి పాలుగాచేయవలెననిన దానిని నీళ్లలోకలిపిన పాలగును) ఆ పద్ధతిప్రకారము కూడబెట్టినపాలను, ఆ దేశమున ఇతరప్రాంతములకు రైలుపైన, రోడ్డున అవసరమైన విమానములలోకూడ రవానాచేసి పసిపాపల కాపాడుచున్నారు. ఈ పని 10 సం॥ లనుంచీ లండనులోని షార్లొట్ రాణి ఆసుపత్రిలో జరుగుచున్నది. వీరినిచూచి ఇతర పట్నాలలో ఈ పని ప్రారంభిస్తున్నారు.

♦ ♦ ♦

ప. బంగాళా గవర్నరు సి. రాజగోపాలాచారిగారు కలకత్తా గవర్నమెంటు భవనములో బిడ్డలకు విందుచేశారు. జితేంద్రనారాయణ్‌రేగారి శిశుపోషణాలయంనుంచీ 2 సం॥ మొదలు 8 సం॥ ల వయస్సుగల పిల్లలను 400 మందిని ఆహ్వానించి సత్కరించారు. ఆ గవర్నమెంటుభవనంలో పనిచేసే నౌకర్ల పిల్లలనుగూడ 100 మందిని ఆహ్వానించారు. వీరందరికి వినోదంగా అలీపూర్ జంతుప్రదర్శనశాలనుండి పక్షులు, జంతువులు తెప్పించి ప్రదర్శించారు. కోతులు సైకిళ్లుతొక్కుట, తాబేళ్లపరుగు పందెములు, మొదలగు వినోదములు జరిగెను. జంతువులలో 5 నెలల ఏనుగపిల్లగూడనుండెను. వినోదము పూర్తియైనపిమ్మట, పిల్లలకు పిప్పరమెంట్లపొట్లాలు పంచిపెట్టబడెను. పిల్లలందరు ప్రార్థనసలిపిరి.

---

# అభినయము కళయేనా?

శ్రీమతి నాగదేశి ఈశ్వరమ్మగారు

సామాన్యంగా లోకంలో చతుష్షష్టి కళలని ప్రతీతి. ఆలోచించి చూస్తే యీ 64 గింటిలో చేరని దేం వుం డనిపిస్తుంది. మళ్లీ యీకళల్లో లలితకళలని మనవాళ్లు కొన్నిటిని పేర్కొం టుంటారు. అవి నాల్గని కొందఱు, అయిదని మరికొందరున్నూ అంటూంటారు. సంగీతము, కవిత్వము, చిత్రలేఖనము, శిల్పము, అన్నవి నాల్గూ లలితకళలని కొందఱి యభిప్రాయము. నాట్యము కూడా కలిస్తే 5 అగునని మఱి కొందఱి యూహ. సంగీతాదులు నాల్గూ లోకంలో, ఎంత ప్రచురాలో నాట్యం కూడా అంత ప్రచుర మైనదే. దేశ కాల పాత్రల్ని బట్టి సంగీతము వాటికి మల్లేనే నాట్యంలో కూడా భేదాలున్నాయి.

అసలు అభినయం అంటే ఏమిటి? నాట్యం అంటే ఏమిటి? అనే విషయాన్ని మనప్రాచీనులు చెప్పినట్లు విచారిద్దాం.

మనకి నాట్యాన్ని గురించి కావాలంటే ధనంజయుడు రాసిన దశరూపకం కొంత ఆధారం కావచ్చు. బ్రహ్మదేవుడు నాట్యవేదం రాశాడట. దానికి ప్రబంధాన్ని భరతముని రాశాడట. తాండవం నీలకంఠుడు రాశాట.

నాట్యవేదం విరించిశ్చక్రే, తస్యప్రబంధం మునిరపి భరతః తాండవం నీలకంఠః

అని దశరూపకంలో కలదు.

దశరూపకాన్ని బట్టి చూస్తే అభినయమంటే

"అభినయతీత్యభినయః" అనగా అభిముఖమును పొందించునది. ప్రేక్షకుల నభిముఖులనుగా చేయునది యభినయ మని తెలుచున్నది.

ఇట్టి యభినయము నాల్గువిధములు. సాత్త్వికాభినయము, ఆంగికాభినయము, వాచికాభినయము, ఆహార్యాభినయము అని.

ఈ నాల్గు విధాల అభినయాలతో ధీరోదాత్తుడు మొదలైన నాయకుల అవస్థలను అనుకరించడం నాట్యం.

చతుర్విధై రభినయై స్సాత్త్వికాంగిక పూర్వకైః ధీరోదాత్తా ద్యవస్థానుకృతి ర్నాట్యం.

సాత్త్వికము అంటే ఇతరుల సుఖదుఃఖముల భావించుటచే ఆసుఖదుఃఖములు తనవే అనుకొనుట సత్త్వము. దానివలన కలిగిన గగుర్పాటు మున్నగునవి సాత్త్వికములు. వానిని ప్రకటించుట సాత్త్వికాభినయము.

నాటకాదులలో గాని లౌకికముగా గాని మాటాడు మాట కనుగుణముగా చేతులు మూతి ముక్కు మున్నగునవి త్రిప్పుట ఆంగికాభినయము.

సమయానుకూలమగు సంభాషణమును రసానుగుణమగు సంగీతమును వాచికాభినయ మగును.

ఆహార్యకమనగా యుక్తమగు వస్త్రభూషణాదుల ధరియించుట.

ఈనాల్గు విధాల అభినయాలతోను రాముడు మున్నగు నాయకుల యవస్థల ననుకరించుట నాట్యము.

పైవిధమును చూచినచో యిప్పుడు మన వారిలో కొందఱు "మావాడు అభినయ కళలో చాలా దిట్టమైన చేయితేండి. అందులో మాంచి పరిశ్రమ చేశాడు" అని అంటూండడం అంత యుక్తం కాదనుకుంటాను.

అభినయాన్ని కళ అనడమే కాకుండా మనం చాలమంది అభినయం అంటే తనకులేని భావాన్ని తెచ్చిపెట్టుకుని నటించడం అని అర్థం చెప్తూ కపటిచేయు భావ ప్రకట నాదికాభినయం అంటున్నాం. చూడండి ఒక్క ఉదాహరణ. వాడు బలే తమాషా మనిషిరా; వాడి అభినయం వాడి వాటం అంతా ఎల్లావుందో-చూడు. అంటూంటాం.

ఇంతేకాదు కపటంగా సంచరించే వాణ్ణి గురించి వాడిదంతా ఒట్టి నాటకంరా అంటూంటాం.

అంచేత కాలక్రమాన్ని లోకంలో స్థిరపడిన అర్థాలకూ పరమార్థాలకూ లంకె కుదరదు. అల్లా వచ్చిందే 'అభినయకళ' అన్నమాట అంతే కాని అభినయము కళ కాదు, నాట్య కళలో అంతర్భూత మన్నమాట.



# సామెతలు

81 పొరుగింటి పుల్లకూర రుచి.
82 అంబలి తాగేవాడికి మీసాలు దువ్వేవాడొకడు.
83 నక్కఎక్కడ? దేవలోకమెక్కడ?
84 కళ్లుమూసుకొని అల్లప్పచ్చడి.
85 స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః.
86 వినాశకాలే విపరీతబుద్ధిః.
87 గుఱ్ఱము గుడ్డిదయినా దాణాకు లోటు లేదు.
88 చేతకాని వానికి శౌర్యమెక్కువ.
89 సిరి అబ్బదుకాని చీడ అబ్బుతుంది.
90 పుట్టకెక్కలేనిది స్వర్గాని కెక్కు తుందిట.
91 మహారాజని మనవిచేస్తే మరిరెండు తన్న మన్నాడుట.
92 తోకతెగిన నక్క.
93 మ్రొక్కబోయినగుడి విరిగి మీద పడినట్లు.
94 ఫుల్లో పెళ్లి అయితే కుక్కలకు హడావుడి.
95 వడుగులో చెప్పింది వున్నది కాదా?
96 రెంటికి చెడ్డరేవడు.
97 అయినవాడికి ఆకుల్లో, కానివాడికి కంచాలలో.
98 ఎద్దుపుండు కాకికేమి తెలుసు?
99 తనకున్నపని తినకున్న తీరదు.
100 బద్ధకం పరమ దరిద్రం.
101 చెప్పేవి శ్రీరంగనీతులు, దూరేవి దొమ్మరి గుడిశలు.
102 రామాయణములో పిడకలవేట.
103 పుఱ్ఱెతో పుట్టిన బుద్ధి పుడకలతోగాని పోదు.
104 పిట్టకొంచెము కూత ఘనము.
105 నలుగురిని చంపితే గాని డాక్టరు కాడు.
106 కష్టపడి సుఖపడ మన్నారు.
107 మావాడు లేకుండచూచి మరొకడచ్చా కొట్ట మన్నారు.
108 ఆడలేక మద్దెల ఓడన్నదిట.
109 గాలిలో మేడలు.
110 గొంతెమ్మ కోరికలు.
111 గుడ్డిఎద్దు చేనులో పడినట్టు.
112 గుడ్డిగుఱ్ఱం తాపు.
113 జన్మానికో శివరాత్రి.
114 నలుగురితో నారాయణా.
115 పరోపకారార్థమిదం శరీరమ్.
116 తానొకటి తలచిన దైవమొకటి తలచును.
117 గుడ్డికన్నుమూస్తే ఎంతో, తెరిస్తే అంతే.
118 గుడ్డిలో మెల్ల నయము.
119 కుక్కతోక పట్టుకొని గోదావరి యీదినట్టు.
120 కెంపు నేసెరుగనా కుంపటివలెనుండు, కొమ్ములుండు రెండు, కోతికివలె.
121 తాచెడ్డకోతి వనమెల్ల చెరచె.
122 తినగా తినగా గారెలు చేదు.
123 ఇంటిదొంగను ఈశ్వరుడైన పట్టలేడు.
124 ఒకవూరిరాజు మరొకవూరి మాల.
125 ముసలి ఎద్దా పాటుపడు.


కుష్ఠు ★ బొల్లి
అన్నిరకముల కుష్ఠునకు, బొల్లి వ్యాధులకు ఇతర చర్మవ్యాధులకు గ్యారంటీగా పనిచేయుచున్నవి
మా ఔషధ రాజములే!! కేటలాగులు, యోగ్యతాపత్రములు ఉచితము!
రెడ్డి & కో., (రిజిష్టర్డ) H. O. గోపాలపురం (వయా) తణుకు, తూ. గోదావరిజిల్లా
బ్రాంచ్ ఆఫీసులు.
బెజవాడ ★ వాల్తేరు ★ కటక్ ★ సికిందరాబాద్
గాంధినగరం R. S. బక్సీబజార్ 3560 కింగ్స్వే
నెల్లూరు ★ బరంపురం ★ ఫజిల్‌నగర్
కాపువీధి, పెద్దబజారు గోరక్‌పూర్,

# సైరంధ్రి

దైవం బనుకూలింపఁడు
గావున నని విడువ నౌనె కార్యంబుల? నే
కైవడిఁ దిలల న్నూనియ
గావింపగ వచ్చుఁ బురుష కారము లేమిన్.

వెలయ నీప్సితంబు తలఁపున సిద్ధింప
దుద్యమంబు లేక యుండెనేనిఁ
జూడ మృగగణంబు సుఖసుప్త హర్యక్ష
వదన గహ్వరంబు వచ్చి చొరునె?

అని మొన నిల్చి పోరిన జయాపజయంబుల తీరులెట్లో! పో
రున గురుబంధు మిత్రులు నరుల్ నరనాథులు ద్రెళ్లకుందురే
యని దలపోసి ధర్మసుతు డాహవముఁ దలపెట్టఁ డెన్న; డా
తని యనుజుల్ తదాజ్ఞ జవదాటరు మీదటి కార్య మెట్లగున్.

పా లడుగంగ ధర్మజుఁడు బంపును గృష్ణుని; నాంబికేయుడున్
మేలు దలంచి యుత్తములు మెచ్చగఁ దమ్ముని పా లొసంగఁ; డా
కూళ సుయోధనుండు కవకూడి మనన్ దలపోయఁ; డెప్పుడే
లీల యొనర్చునో హరి, కృపారస మేక్రియఁ జూప నెంచునో?

అడియాస లేల యూరక?
యొడయం డాలంబు సేయ నొల్లఁడు; రాజ్యం
బడిగిన నీఁడు సుయోధనుఁ;
డడవియె శరణంబు వీరి కయ్యెడి నేమో!

కఱకు మనంబు రాచముదుకం డతిలోభి దయావిహీను డం
చెఱుగఁడొ కృష్ణుఁడైన, నెటుపోవును ధర్మజుఁ డంప సంధికిన్?
మఱచునె వారు మున్నటుల మాయెడఁ జేసిన ద్రోహచింతనల్;
వెఱచునె విప్పిచెప్పఁ గురువీరసభాస్థలిలోనఁ గృష్ణుడున్?

ఆలిని గోకలొల్చిన దురాత్ముని భీముని పాలుచేసి, పాం
చాలినిఁ దూలనాడిన నిశాచరు నర్జును పాలుపెట్టి, యా
పాలను గొల్చుచుండు నరపాలురఁ దమ్ములపాలు సేయకే
పాలడుగంగ ధర్మజుఁడు పంపునటే హరిఁ దండ్రి పాలికిన్!

రాజసూయమున పరాభవం బందిన
యదిమొదల్ మది నింత కుదురు లేక
మామతో గలసి దుర్మంత్ర మాలోచించి
జూదమాడఁగ నెంచి సుతుఁడు తన్ను
గోరగా వలదనఁ గూడదే యంధుండు
విదురునిఁ బంపి పిలిపింప నేల?

వలవ దీజూదంబు వలన భేదముఁ బుట్టు
నని విదురుండు నొక్కి యనగ లేదె?
ఎఱిఁగి, యెఱిఁగియు ముదుసలి యెఱుఁగనట్లు
గరళ మిశ్రిత నవనీత ఖండములుగఁ
బలికె మాటలు పోరెటుల్ గలుగుననుచు
గ్రుడ్డిరా జింతకును మూలకుధర మయ్యె.

జూదమునను బుట్టు భేదంబు నీపుత్ర
కులకు పాండు నందనుల కటంచు
చెవుల నిల్లుగట్టి చెప్పడే విదురుండు
నాంబికేయుఁ డెరుగఁ డయ్యెఁ గాని.

జూదమున బుట్టె బేధంబు సువ్వె; దాన
నెన్నియో బుట్టె నాపద; లింతయేల
కౌరవకులంబున కె గాదు కలిగె నెల్ల
రాజవరులకు నాశంబు రాజరాజ.

కులవినాశంబు భేదంబు గలుగుననచు
అద్దమున జూపినట్లు ధర్మార్థ మెల్ల
విప్పి చెప్పడె నీతికోవిదుఁడు విదురుఁ
డాంబికేయుండు చెవి నిడఁడయ్యె గాని.

అని విదురుఁ డెన్నొ దెల్పిన
మనమున జీరికినిగొనెనె; మాన్పెనెపుత్రున్;
ఘనపుత్రమోహ మెట్టిదో
మనపఁడు ధర్మంబు వంశమర్యాదైనన్.

కురుకుల సార్వభౌముఁ డెరుఁగుంగద, పుత్రుని దుండగమ్ము లీ
సరణి యధర్మమంబుఁ; దనుజాతుల సుంతయు మందలింప; డే
నరపతి దుష్టశిక్షణ యొనర్పఁడొ యాతఁ డఘమ్ముఁ నొందు; నీ
కరకుమనంబు రాచముదుకండు బలా పెనుదాయ యయ్యెఁబో.

(సశేషము)

గంటి కృష్ణవేణమ్మ.

—:౦:—

# శుక్రవారం

## శ్రీమతి భోగరాజు చిట్టెమ్మగారు.

● ● ●

సాయంకాలం 6 గంటలయింది. సూర్యభగవానుడు కూడా యింటికి వెళ్లేటందుకు తొందర పడుతున్నాడు. పక్షులు గుంపులు గుంపులుగా గూళ్ల వైపుకు ఎగిరి పోతున్నాయి. ఆతొందరలోనే కనిపిస్తోంది ప్రొద్దుటినుంచి విడిచిపెట్టియున్న పిల్లల్ని కలుసుకోవాలని అవి పడే ఆతృత. కూలినాలి జనం కూడా పని పూర్తిచేసుకుని కూనిరాగాలు తీసుకుంటూ తమతమ గుడిసెలలోకి పోతున్నారు. పాపం నారాయుడు ఇంకా పనిచేస్తూనేయున్నాడు.

బాబయ్యా, ఈరోజున కూలిప్పించండి, నాల్గురోజులయిందండి మాయింటిదిలేచి. కూలిప్పిస్తే మందేయిస్తానండి.

రేపిస్తాలేరా, ఎందుకలా తొందరపడతావు?

అయ్యగారూ, కాస్త కనికరించండి, మీకాళ్లకి మొక్కుతా.

సరే, అలాగే యిస్తాలే, ఒరే రాముడూ రెండురూపాయలు తెచ్చివీడికివ్వరా, పాపం గోలపెడుతున్నాడు.

రాముడూ, ఇనప్పెట్టె తీస్తున్నావెందుకురా.-అంది వెంకమ్మ.

ఏమీలేదే అమ్మా, నారాయుడుకి కూలివ్వడానికి.

ఎన్నిమాట్లుచెప్పనురా నీకూ మీనాన్నకీ? శుక్రవారంపూటా ఎవరికి ఏమీ ఇవ్వకూడదు దేముడా అంటే నామాట వినిపించుకోరుగదా!

ఏమిటే, ఆ గడబిడ, గొంతుక చించుకుంటున్నావేమిటి? అంటూ లోపలికి వచ్చాడు రఘునాధరావు.

ఏమిటా! ఎన్నిసార్లుచెప్పాను మీకు!

అబ్బా! అసలుసంగతియేమిటో చెప్పుబాబూ!

నారాయుడుకి కూలివ్వడానికి వీల్లేదు. ఇవ్వాళ శుక్రవారం.

శుక్రవారమో, గిక్రవారమో. వాడిపెళ్లానికి జబ్బుగా వుందట కాస్త ఇవ్వనియ్యి ఇవ్వాళకి.

సరేలెండి నేర్చుకు పోయారు. తెలియకపోతే వూరుకోండి; నాకంఠంలో వూపిరివుండగా ఇల్లాంటి పనులు చెయ్యనియ్యను.

అమ్మగోరూ రచ్చించండి.

ఛా! వెధవా! అవతలకుపో బుద్ధిలేదురా నీకు! అంటూ వెంకమ్మగారు తిట్లవర్షం కురిపించటం మొదలు పెట్టింది.

ఆవర్షానికి తట్టుకోలేక కళ్లనీళ్లు కారుస్తూ వెళ్లిపోయాడు నారాయుడు.

♦ ♦ ♦

ఏమండోయ్, 'బ్రహ్మరథం' బాగున్నదని అందరూ చెబుతున్నారు. పదిరూపాయిలు ఇల్లాపడెయ్యండి. వెళ్లివస్తాం.

శుక్రవారం

గృహలక్ష్మి

ఇవ్వాళ శుక్రవారం కాదటే మరి!

ఏం మాటలండిమీవి, సినిమాకి వెళ్లటానికి శుక్రవారం యేమిటి?

♦ ♦ ♦

చీకటిపడింది. కళ్లవెంటనీరు, కారుస్తూ నారాయుడు యింటికి వెడుతున్నాడు. వాడిమనస్సు అంతా అంధకారమయంగావుంది. బయటా చీకటి, లోపలా చీకటి. యింటికి వెళ్లగానే పిల్లలు 'అయ్యా' 'అయ్యా' అంటూ పరుగెత్తుకు వస్తారు. ఆకలిఅంటూ యేడుస్తారు. ఆ అస్థిపంజరాల్ని ఓదార్చేమార్గం యేమిటి? నారాయుడిభార్య నాల్గురోజుల్నించి జ్వరంతో బాధపడుతోంది. పిలిస్తే పలకదు, మాట్లాడదు. మందిప్పిద్దామంటే చేతులో పైసాలేదు. చూడటానికే అయిదురూపాయి లడుగుతాడా డాక్టరు. ఏం చేయ్యాలో వాడికేమీ తోచడంలేదు. విచారసముద్రంలో మునిగి వుక్కిరి బిక్కిరి అయిపోతున్నాడు పాపం.

'అయ్యా, ఇయ్యాలేం కూడులేదుపో అని కొత్తింది, అక్క' అంటూమూడేళ్లది-రాముడు కాళ్లకి చుట్టేసుకుంది.

నారాయుడు ఉలిక్కిపడ్డాడు, అప్పుడే యింటికివచ్చానే అనుకున్నాడు.

'మరేం, పొద్దుణ్ణించి ఒక్క మెతుకుకూడా తినలేదు. కడుపులో మండిపోతూంది' అంటూ ఇద్దరుపిల్లలూ పరుగెత్తుకువచ్చారు. పెద్దపిల్ల గుంటలుపడినకళ్లతో, ఎండిపోయిన మొహంతో, నరములేకాని చీము నెత్తురు లేని శరీరంతో దూరంగానుంచుని తండ్రివైపు దీనంగాచూడటం మొదలుపెట్టింది.

మధ్య మధ్య రోగి పిచ్చికేకలు. నారాయుడు దగ్గరకువెళ్లి చూచాడు. కాళ్లు, చేతులు చల్లగా వున్నాయి. వాడికి మతిపోయింది. గబగబా డాక్టరుగారింటికి పరుగెత్తుకు వెళ్లాడు.

♦ ♦ ♦

'బాబూ, దణ్ణాలండి, చాలాజబ్బుగావుంది. రచ్చించండిబాబూ' 'ఇప్పుడు వాడవలసినమందు చాలా వెలగలది. అయిదురూపాయలయినా పట్టుకురా. తప్పకుండా వస్తాను.'

'అయ్యాపేదోడనండి, యిల్లునిలబెట్టండి, మీపేరు చెప్పుకుంటా.' చేతులుజోడించాడు, కాళ్లమీద పడ్డాడు. కాని ఆకఠినహృదయుని మనస్సు కరగలా. అసలు దాన్నిమనస్సు అనటం కన్న పాషాణమే అనటం మంచిదేమో.

యజమానియింటికి వెడితే ఏమన్నాయిస్తాడేమో అన్నఆశతో పరుగెత్తడం మొదలుపెట్టాడు.

చీకటి బాగాయెక్కువగావుంది. అక్కడక్కడ మిణుగురు పురుగులు మాత్రం మిణుకు మిణుకు మంటున్నాయి. వాడిమనస్సులోని ఆశలాగానే, ఆఅంధకార మాయప్రపంచంలో, ఆమేఘాలరాజ్యంలో, పొలాలగట్ల వెంట గాలికంటె యెక్కువవేగంగా పరుగెత్తుతున్నాడు. పడుతూ లేస్తూ యజమానియింటికి జేరుకున్నాడు. 'యెవడ్రావాడు?' వెంకమ్మ కర్కశస్వరం వినిపించింది. నేనమ్మా, నారాయుణ్ణి, రచ్చించండి, అంటూ కాళ్లమీదపడ్డాడు.

ఒరే కిష్టిగా, వీణ్ణవతలకు యీడ్చెయ్యరా.

రెండుయినపచేతులు నారాయుణ్ణి బయటకుతోసి గేటువేశాయి.

(o)

# స్త్రీల కర్తవ్యము



"స్త్రీ" ఏమీ చేతకానిదనిన్నీ, ఆమెకు జ్ఞానము, మనస్సు, సరదావుండవనిన్నీ మగవారిలో కొంత మంది భావించెదరు. మగవారననేల? స్త్రీలలో స్త్రీలే చాలామంది ఆ విధముగా అపోహపడుచూ వారలజాతిని వారే నిందించుకొనెదరు. "ఆడదై పుట్టుటకంటె అడవిలో మ్రానైపుట్టుట మేలు" అని ప్రతి చిన్న కాని విషయమునకున్నూ వాపోయెదరు. ఇది ప్రతి చిన్న సాధారణ కుటుంబీకుల ఇంటిలోనూ జరుగుచున్న దినచర్య.

ఆ విధముగా గృహిణులు బాధపడుట కడునీచము. వారు తాము నిజముగా విచారకరమగు పరిస్థితిలో యుండినప్పటికిన్నీ వారు తమ్మునున్నూ తమసంసారమునున్నూ కుటుంబమునున్నూ ఉత్సాహపరుపవచ్చును. అందులకుగాను స్త్రీలు తమకర్తవ్యమును గుర్తించవలెను. విద్య, సంగీతము, చిత్రలేఖనము మొదలగు కళలను స్త్రీ లభ్యసించవలెను. బంధువులు, స్నేహితులు, పరిచితులు—వీరందరితోనున్నూ కలసిమెలసియుండుట, మంచివాక్కును కలిగియుండుట, వారిని మర్యాదచేయుట ముఖ్యమైన విషయములు. భర్త కనుగుణ్యముగా స్త్రీ వ్యవహరింపవలెను. అటులుండు స్త్రీలు పేరుప్రఖ్యాతులనుగాంచి వన్నెకెక్కెదరు.

"స్త్రీ" తనకు స్వాతంత్ర్యములేదనిన్నీ విశ్రాంతిలేదనిన్నీ భావించుట పొరబాటు. భార్యాభర్త లుభయులకు బాధ్యతలు, హక్కులు వున్నవి. "స్త్రీ" గృహలక్ష్మి, తనగృహమునకు తాను అధికారి. తన కుటుంబమును తాను పరిపాలింపవచ్చును. పిల్లలకు విద్యాబుద్ధులను గరపి పోషించుట ఆమెయొక్క ప్రథమ బాధ్యత. భర్త విద్యనభ్యసించి విత్తమునార్జించి భార్యాపిల్లలను పోషించవలసియున్నారు. భార్యాభర్తలు చేయుపని ఒకటే అయియున్నది. ఒకరివృత్తులలోనికి ఒకరు ఆక్రమణ చేయకుండ వుండిన యడల సుఖ సంసారమునకు మార్గదర్శకులగుదురు.

తాను గృహమునకు రాణినని, భర్త తన ఆజ్ఞలకు లోనై యుండవలెనన్న దృష్టితో "స్త్రీ" తన భర్తను చూచుటమాని, ఇంటికి చేరినభర్తను తగురీతిని అమృతవాక్కులతోను, భర్తకు కావలసిన పనులను చేయుటవలనయున్నూ గౌరవించి భర్తతో త్రికరణశుద్ధిగా స్త్రీ ఐక్యమగుట "స్త్రీ" యొక్క పరమ ధర్మము, కర్తవ్యము. అప్పుడే స్త్రీకి వలయునంత స్వాతంత్ర్యము, సంతోషము లభించు ననుట నిజము.

యజ్జమిల్లి రుక్మిణమ్మ.


ప్రఖ్యాతిగాంచిన ప్రశస్తమైన

**మెహతావారి విశేష ఔషధములు**

1. సుందరి ఎలిగ్జిర్:—సమస్త ఋతుదోషములను పోగొట్టును, గర్భాశయరోగ అనుపమ నివారిణి.
2. ఫాస్ఫరస్ ఆయిల్:—బాధ నివారణకు సాటిలేని తైలము.
3. మస్తానాపిల్సు:—సాధారణబలహీనత, కీళ్లనొప్పులు, జ్వరములన్నిటికి అమోఘముగాపనిచేయును.
4. ద్రాక్షాసవము:—(బంగారము, మకరధ్వజము కలిసినది) రక్తమును శుద్ధిపరచునటువంటి, అజీర్ణము రూపుమాపునటువంటి బలవర్ధకౌషధము.

కెమిస్టులందరివద్ద దొరకును.

తయారుచేయువారు:—K. S. MEHTA & CO.
250, China Bazar, Madras 1.




1948 ఏప్రిల్

" 1 " శ్రీమతి అరుణ అసఫ్అలీ - కలకత్తాలో సమ్మెకట్టుచున్న యూనియన్ ప్రభుత్వపు తాబేదార్లు నిరశనవ్రతము పూనుట తగదని ఖండించినది.

" 2 " హిందూ పత్రికలో ఈ అక్టోబరులో జార్జిరాజు కుమార్తెను ఎలిజబెత్ రాకుమారికి శిశుజననము కల్గునని సూచింపబడినది.

" 2 " పశ్చిమ పంజాబులో అపహరింపబడిన హిందూ సిఖ్ఖుస్త్రీలను గూర్చి నిరాోగి మంత్రి ప్రకటనగావించినాడు. పలువురు స్త్రీలు జమీందారులచేతులలో నున్నారనియు పాకిస్థాన ప్రభుత్వము వారివిడుదలకై, కృషిచేయుటలేదనియు వదంతులట.

" 3 " మద్రాసులో విద్యోదయ బాలికాపాఠశాలవార్షికోత్సవం మంత్రి థామస్ గారి అధ్యక్షతక్రింద జరిగినది.

" 3 " రూజ్‌వెల్ట్‌సతి రూజ్‌వెల్ట్‌పటము నావిష్కరించుటకై లండనుకువచ్చి రాజభవనమున అతిథిగానున్నది.

" 4 " తూర్పుబంగాళము (పాకిస్థానము) పశ్చిమబంగాళములమధ్య ప్రయాణంచేసే హిందూ వనితలను పాకిస్థానం అధికారులు అసహ్యకరముగా సోదాజూచి అవమానపరచుచున్నారని శ్రీమతి రేణుకారేగారు యూనియన్ శాసనసభలో చెప్పినారు.

" 5 " పశ్చిమ బంగాళము అక్కౌంటెంటు జనరల్ ఆఫీసులోని 4 స్త్రీఉద్యోగులు నిరశనవ్రతము పూనియున్నారు.

" 5 " కోడంబాకంలో పెండ్లిచేసుకొనివస్తున్న పెండ్లివారిలారీ తిరగబడినది. పెండ్లికూతురికి మెడక్రిందిప్రక్క ఎముకవిరిగినది; ఇతరులకు గాయాలైనవి.

" 5 " రష్యా పరిపాలనలోనున్న జర్మన్‌ప్రాంతమునుండి రష్యనుస్త్రీలను శిశువులను ఇంటికి పంపుతున్నారని ట్రిబ్యూన్‌వార్త.

" 5 " గాంధీస్మారకనిధికి శ్రీమతి విజయలక్ష్మి పండిట్‌గారు తమస్వంతధనంనుండి రు 1000/-లు విరాళమిచ్చినారు.

" 7 " నాగపూరులో దాక్షిణాత్యులక్లబ్బు సాంవత్సరికోత్సవమున శ్రీమతి ఉషానారాయణన్ గారికి సంగీత నైపుణ్యమునకై బంగారు పతక మివ్వబడినదని నేటి హిందూపత్రికలోని వార్త. ఇటీవలనే అఖిలభారత సంగీతసభవారు అనేక బంగారుపతక మిచ్చియున్నారు.

" 9 " హిందూలా సవరణచట్టము యూనియన్ పార్లమెంటులో సెలెక్టుకమిటీకి పంపబడినది.

" 12 " బ్రిటిష్ సోల్జర్లు పోలీసులూ పాలస్థీనా పిల్లల వివాహమాడరాదని అధికారులు నిషేధించారు.

" 13 " వజీరుస్థాన్‌లోనున్న నానా మిలిటరీ స్టేషన్‌లో ఇదివరకు కుటుంబాలు ఉండ

దానికి వీలుండేదికాదు; ఈ నాటినుండి ఆ అవకాశం ఏర్పరచారు.

,, 13 ,, ఆస్ట్రేలియనుల విదేశీభార్యలు దేశంలోకి రాకూడదని ప్రభుత్వం ఉత్తరవుచేసింది.

,, 14 ,, ఈ వారపు మద్రాసుగెజటులో-స్కూళ్లలో బాలికలకు ఒకటిమొదలు మూడవ ఫారమువరకు ఇంటిపనులు నేర్పుటకు స్కీము ప్రచురింపబడినది.

,, 15 ,, నెల్లూరుమండలమున అలజడికలుగచేసిన అత్తిపరపు రామిరెడ్డి మోహనమ్మగార్ల వివాహమును నెల్లూరు సబ్‌జడ్జీగారు రద్దుపరచిరి.

,, 16 ,, శ్రీ వీరేశలింగం శతవార్షికోత్సవములు ఆంధ్రదేశమంతటా జరిగినవి.

,, 16 ,, మద్రాసులో బాలోద్యానవన పాఠశాల (Children's Garden School) సాంవత్సరికోత్సవము జరిగినది.

,, 16 ,, ముత్యాలపేట ఏ. ఆర్. సి. బాలికా పాఠశాల విద్యార్థినుల "తల్లుల సమావేశం" జరుపబడినది.

,, 16 ,, మద్రాసురాష్ట్రం సాంఘికసేవా సమావేశమున నేరస్వభావులైన బిడ్డలశిక్షణాలయము నేర్పఱచుటకు ఒకటి ఏర్పడినది.

,, 16 ,, అఖిలభారత మహిళాసంఘపు మద్రాసుశాఖవారి భవనమున గృహప్రవేశంజరిగినది. శ్రీమతి అంబుజమ్మాళ్ దానమగు ఈ భవనమునకు "శ్రీనివాస గాంధి నిలయం" అని పేరు.

,, 17 ,, రష్యాలో భారతయూనియన్ రాయబారి శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ మాస్కోనగరమందలి బాలికాపాఠశాల దర్శించినది.

,, 19 ,, శ్రీమతి మౌంట్‌బాటన్‌సతి శ్రీసుకుమారబోసుగారి చిత్రపటముల ప్రదర్శనమును ఢిల్లీలో తెరిచినది.

,, 21 ,, హత్యగావింపబడిన అంగ్‌సేన్ (బర్మా మాజీ ప్రధాని) భార్య అంగ్‌సేన్‌సతి భారతదేశానికివచ్చి 5 రో॥లు మౌంట్‌బాటన్‌సతి కతిథిగానుండి తిరిగి నేడు బర్మా చేరినది.

,, 24 ,, కమ్యూనిస్టు స్త్రీలు ప్రభుత్వపుటుత్తరువు నుల్లంఘించి ఊరేగింపు సాగించినందులకు - బాష్పవాయువు ప్రయోగించి పోలీసులు వారిని చెదరగొట్టిరి. 72 ముఖ్యురాండ్రను అరెస్టుచేసిరి.

,, ,, ,, శ్రీమతి మృదుల శారాభాయికన్యను పశ్చిమ పాకీస్థానమునగల అపహృతముస్లిమేతర స్త్రీలను విడుదలచేసి తెచ్చుపని త్వరచేయుటకుగాను భారత ప్రభుత్వమువారు నియమించిరని లాహోరువార్త.

,, 26 ,, బ్రిటిష్ రాజదంపతులు తమ వివాహపు రజతోత్సవము నీనాడు మహావైభవముగా జరుపుకున్నారు.

,, 29 ,, మౌంట్‌బాటన్‌సతి మద్రాసువచ్చినది.

,, 30 ,, పశ్చిమ బంగాళములో రాష్ట్రమందలి విద్యావిధాన సంస్కరణ సంఘమేర్పాటైనది. దానిలో శ్రీమతి సుజాతారాయి గారినిగూడా ఒక సభ్యురాలుగా నియమించిరి.

,, 30 ,, శ్రీమతి రుక్మిణి అరండేల్ ఈ రోజున ఆకాశయానమున యూరప్ ఖండమునకు

తరలిపోయినది. ఆమె యూరపుదేశములు ఇంగ్లాండు చుట్టి జూలైనాటికి అమెరికా చేరి దివ్యజ్ఞానసమాజ వార్షికోత్సవమున పాల్గొనును. నవంబరు నాటికి తిరిగి ఇంటికి వచ్చును.

,, 30 ,, శ్రీమతి అమ్మస్వామి నాధన్ గారు శాశ్వత సభ్యులుగా నొక మూడవక్లాసు రైలుప్రయాణీకులసభ ఏర్పాటైనది.

,, 30 ,, కాకినాడలో మునిసిపల్ గరల్స్ హైస్కూలు పెట్టుటకు ప్రభుత్వమువారను మతించారు.

1948 మే_1_తేది

రష్యాలో మేడే ఉత్సవమును భారత ప్రభుత్వరాయబారి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ దర్శించినది.

,, 1 ,, తిరువాంకూరులో 30॥ సం ల కార్మిక యువతి ఆసుపత్రిలో 3 గురు కవల బిడ్డలనుకన్నది. బిడ్డలు తల్లి క్షేమం.

,, 3 ,, శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారి గారిని భారతయూనియన్ గవర్నరు జనరల్ గా రాజుగారు నియమించారు. జూన్ 21 వ తేదినుండి ఉద్యోగం వహిస్తారు.

,, 3 ,, బ్రిటిష్ సింహాసనమున కిప్పటికి వారసురాలైన ఎలిజబెత్ రాకుమారి నివాసము పునర్నిర్మించుటకు ఖర్చు పార్లమెంటులో ఆక్షేపింపబడినది.

,, 3 ,, మార్చి 9 వ తేదిని, ఢిల్లీలో ఆహారశాఖ ఆఫీసులో నొక దాక్షిణాత్య యువకునిపై పిస్తోలుపేల్చిన దాక్షిణాత్య యువతి శకుంతలను జడ్జీగారు జామీనుపై విడుదల చేసినారు.

,, 3 ,, మద్రాసుప్రభుత్వం స్త్రీలను పోలీసు శాఖలో చేర్చుకొనుటకు నిర్ణయించినారు అనివార్త. ముందుగా మద్రాసులో వీరిని ఏర్పరతురట.

,, 3 ,, భవాల్ పురం సంస్థానమువారు అపహృతస్త్రీలను వెలుపరచి సంరక్షణ చేకూర్చ తాత్సార మొనర్చుచున్నారని అంతస్ సలాంకన్య (గాంధీశిష్యురాలు) నేటినుండి ప్రాయోపవేశమారంభించినది.

,, 7 ,, పెద్దాపురంలో కస్తూరిబా మహిళా పాఠశాల ప్రథమ వార్షికోత్సవం శ్రీమతి పాణకా కనకమ్మగారి అధ్యక్షతక్రింద జరిగినది.

---

:జండూ బాలామృతం:




క్షీణించి అనారోగ్య వంతులుగ నుండు బిడ్డలకు అమృతము

సీసా 1-కి రు 1-1-0.

జండూవారి ఏజంట్లయొద్ద దొరుకును.

# సంపాదకీయములు

## శ్రీ ప్రొఫెసరు ధోండో కేశవ కార్వే నవతియుత్సవము

భారత మహిళా విశ్వవిద్యాలయ స్థాపకులు నిర్వాహకులునైన శ్రీ ప్రొఫెసర్ ధోండో కేశవ కార్వే గారికి ఈ 18-4-48 నాటికి 90 సం॥ నిండినవనియు, వారికా నాటి యుత్సవమును పూనా బొంబాయి నగరముల అత్యుత్సాహమున వైభవముతో జరుపబడినదనియు వినుటకెంతయు సంతోషించుచున్నాము. వారి జీవిత చారిత్రమును వేరొకచో వ్రాసియున్నాముగావున విశేషముగా నిట చెప్పనవసరములేదు. వారికృషికి భారత నారీలోకము నిరంతరము కృతజ్ఞత చూపుచుండునని విశ్వసించుచున్నాము. శ్రీ కార్వేగారికి ఈశ్వరుడాయురారోగ్యము లొసంగి శతాధికజీవిని గావించునని ఆశించుచు వారి అడుగుజాడల స్త్రీవిద్యావ్యాప్తికై కృషిచేయువారల కందరికి సంప్రతించి సలహాల పొందుట కనువై యుండునని విశ్వసించుచున్నాము.

## స్త్రీలకు సైనికశిక్షణ

స్త్రీలకు సైనికశిక్షణమవసరమని మేముచిరకాలంగా వ్రాస్తున్నాము. కైక, సీత, సత్యభామ, సుభద్రాదులు ధనుర్విద్యా పారంగతులనుట పురాణప్రసిద్ధము. నిరంతరము ద్విజులుపాసించు గాయిత్రీదేవి అంకుశ, కశాధారిణి, చక్రగదాపాణి; దుర్గాదేవత దశవిధప్రహారిణి; మహిషాసురమర్దని. చారిత్రకయుగమునను రాణీ సంయుక్త, అహల్యాబాయి, చాంద్ బీబి, రుద్రమదేవి, నాయకురాలు, ఝాన్సీలక్ష్మీబాయి ఇత్యాదులందరును యుద్ధకుశలలేగదా. నేడు రాజకీయములకై దురుసొనర్చు మతాంతరులు హిందూ శిఖు స్త్రీల నెంతగాసి పెట్టుచున్నది చెవులు చిల్లులుపడ ప్రతిరోజూ వింటున్నాము. కావున సాంప్రదాయానుసారము, అవసరముకొద్ది, నేడు స్త్రీలకు సైనిక శిక్షణం ఆవశ్యమే. ఈవిషయమై కేంద్రప్రభుత్వమువారును గుర్తించి స్త్రీలకు సైనిక శిక్షణమునకు తగు ఏర్పాట్లు గావించినట్లు శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ గారు అఖిలభారత మహిళాసంఘాధ్యక్షురాలగు శ్రీమతి కాళేగారికి తెల్పియున్నారని విని సంతసించుచున్నాము. అదికేవలము ప్రభుత్వపుటుత్తరువుగానే నిలుపక దీనిసంపూర్ణావకాశమును స్త్రీలువినియోగించు కొందురని ఆశిస్తున్నాము.

## శ్రీమతి రుక్మిణి అరండేల్ గారు దేశపర్యటనము

శ్రీమతి రుక్మిణి అరండేల్ గారొక ఆరునెలలకాలముల విదేశములందు పర్యటనమొనర్చి వచ్చుటకై ఈమాసమధ్యమున ఆకాశయానమున వెళ్లియున్నారు. కొలది సంవత్సరములుగా నీమె ప్రాచీన భారతీయ నాట్యకళోద్ధరణకై పాటుబడుచున్నది. స్వయముగా నామె భరతశాస్త్రవేత్తయేగాక, ప్రదర్శన కుశలియునై యున్నది. నాట్యకళ నామె ప్రదర్శించు నేర్పునుగూర్చి దేశీయులేగాక పాశ్చాత్యులును విశేషముగా ప్రశంసించియున్నారు. ప్రదర్శనసమయముల నామెచూపు హావభావవిలాసభంగిమలు ఉదాత్త రసోద్దీపకములైన వనజెల్లును. సంఘమున దూష్యముగు స్త్రీల హస్తగతమై యుండిన కళను ఇట్లు ఇల్లాండ్రు చేపట్టి యుద్ధరించుట ప్రశంసార్హము. ఈమె ఈ పర్యటన మందు, యుద్ధానంతరపు సమస్యలతో కడునలుగుచున్న పాశ్చాత్య ప్రపంచమును తన నాట్యకళాప్రదర్శనముచే కొంత ఓదార్చ వచ్చునని ఆశించుచున్నాము. ఈమె ప్రయాణము సుఖవంతమై, క్షేమముగ తిరిగిరా నీశ్వరుడనుకూలించుగాక అని ఆశించెదము.

## భూవసతిమార్పు: స్త్రీలహక్కులు

సాంఘికముగా తామస్వాతంత్ర్యము కోరుచున్న స్త్రీలు ఆర్థికమగు మార్పులను అడ్డుపెట్టజాలరు. అయితే ఒక్కసారిగా తమ ఆర్థికపరిస్థితులు తల్లక్రిందులగుట పురుషులే తట్టుకోజాలనప్పుడు అబలలస్థితి చెప్పవలయునా? మన రివిన్యూమంత్రి జమిందారులతోపాటు ఇనాందారులను తుడిచిపెట్టుచున్న సాహసికుడు. స్త్రీలు సాహసమును మెచ్చుకొందురు. అయితే ఆసాహసము వివేకయుతము వివేచనా పూరితము కానప్పుడు సంఘము పలుబాధల నందవలసివచ్చును. ఇటీవల వారు రేడియో ప్రసంగవశమున భూవసతిలో మార్పులు తేవలసియున్నది అన్నారు. దానిని మేమున్నూ కాదనము. అయితే స్త్రీలభూవసతి హక్కును తొలగించి కిసానుల పరము గావించుటలో కొంత జాగ్రత్త వహించవలయునని మాత్రము హెచ్చరింతుము. భూవసతిని స్వతస్సిద్ధముగా గల స్త్రీలు స్వల్పము. పలువురకది ఆధరవు తప్పినప్పుడు పొందు మను వృత్తిరూపకమే. పురుషుడు గతించిన పిదప బావయో, మరదియో, మామయో, సవతికొడుకో, దత్తపుత్రుడో, తోడుగు వదల్చుకొనుటకై ఆమె మొగమున వేయునట్టివియే చాలవరకీ భూవసతులు. అవి సామాన్యంగా ఎకరము 2 ఎకరములలోపే. వీరన్న రెండు ఎకరములలోపు 51% వ్యవసాయదార్ల క్రిందికేవారు వత్తురు. అట్టిచో ఆఅబలల నోటివద్ద కూడుదీసి భూమిదున్ను కిసాన్ అని రైతుపరమొనర్చుట అన్యాయము. ఇంతకు ఈ రైతు ఏ సోతుబరియో అయియుండును. నమ్మకమునకై స్త్రీలు సామాన్యముగా పెద్ద ఆసాముల కిస్తారు. దానిపై యొకనిర్ణీతమగు ఆదాయము నంచనా వేసియే అదివారికివ్వబడినది. నేడా ఆదాయము తగ్గించినచో వారిగతియేమి? బాగావిద్యావంతమైన దేశములలోను ఇట్టిభూవసతిమార్పులు అమలు జరుపుటకు 20 సం॥లు పట్టెనని వెంకట్రావుగారే అన్నారు, కావున భగవంతుడొకసారి చేసిన అనాధలను రివెన్యూ మంత్రిగారు మరొకసారి గావింపక వారివిషయమై తగిన మినహాయింపులు చేతురని ఆసింతుము. రాగలజమీందారీ బిల్లులోను మనువృత్తికై అనాధలకివ్వబడిన ఇనాము భూములపట్ల కూడ నీ న్యాయమును పాటింతురు గాక.

## శ్రీ రాజాజీ ప్రథమ భారతీయ గవర్నర్ జనరల్.

మన మద్రాసు రాష్ట్రమునకు చెందిన శ్రీరాజాజీగారు ప్రథమ భారతీయ గవర్నరుజనరల్‌గా నేర్పాటై నందులకు మద్రాసు రాష్ట్రవాసులమంతయు గర్వించవలసియున్నది. నిజమునకు భారతీయులందరు గర్వించుచున్నారు. శ్రీ రాజాజీ నేటిరాజకీయవేత్తలలోకెల్ల మేధాసంపన్నుడని పలువురు పాశ్చాత్యులును ప్రశంసించియున్నారు. నేడు దేశము నెదుర్కొనుచున్న విషమసమస్యలను చాకచక్యముతో పరిష్కరించుటకు తోడ్పడగల యుక్తిశాలి. ముఖ్యముగా పాకిస్థాన్, కాశ్మీర్, హైదరాబాదు సమస్యలను మెళకువతో నవరించగలరు. ముఖ్యముగా సాన భూతితో, సమర్థతతో దుండగీంద్రచే అపహృతమైన స్త్రీలను శిశువులను తమ స్వస్థానములకు చేర్పించుటకు కృషిచేయవలసియున్నది. ఉత్సాహముకొలది ప్రజాప్రభుత్వములు, రాష్ట్రములందును కేంద్రమునను చేయుచున్న పలుచట్టముల ననుమతించుపట్ల అనేక ప్రతికూల పరిస్థితులలో నున్న స్త్రీలహక్కులకు భంగకరముకాకుండ కాపాడవలసియున్నది. శ్రీ రాజాజీగారి ఈ రెండుకార్యములొనర్పగల సమర్థుడనుట నిస్సంశయము. నూతన భారతీయ గవర్నర్‌జనరల్‌గ వారికి హృదయ పూర్వక స్వాగత మిచ్చుచున్నాము.




## హైదరాబాద్

క్రొత్తతెలుగు వారపత్రిక బెజవాడనుండి వెలువడుచున్నది. ప్రథమసంచికను సంపాదకులు శ్రీ డాక్టరు యం. చెన్నారెడ్డిగారు మా కార్యాలయమున కంపగా కృతజ్ఞతతో స్వీకరించితిమి. హైదరాబాదులో నేడు నైజాము పరీకున జరుగుచున్న వనబడు ఇతేహాదుల్ ముసల్మీన్ దుండగములను ఇదితీవ్రముగా ఎదుర్కొంటున్నది. హైదరాబాదు రాజ్యంలో 60% కుపైన ఉంటే తెలుగువారినీ పరిసరములనంటియుండే భూభాగమందలి తెలుగువారినీ ఈ హైదరాబాదురాజ్యాన్ని విచ్ఛిన్నంచేసి ప్రజాప్రభుత్వం ఏర్పడే మార్గములు నిర్మించమని హెచ్చరించుటకు ఈ పత్రిక కంకణందాల్చిందనవచ్చును. భారతరాజకీయాలలో నిది సోషలిస్టు పంథానుత్రొక్కుచున్నది. జాగ్రత్తగానడిస్తే-దీనికి మంచిభవిష్యత్తున్నదనవచ్చు. సం॥ చందా రు 6-0-0లు. వలయువారు మ్యానేజరు “హైదరాబాద్” పత్రిక 20/333 గవర్నరుపేట బెజవాడ అని వ్రాసిన బడయగలరు.

## ఆర్య

ఇది రాజమహేంద్రవరంనుండి క్రొత్తగా వెలువడుతున్న తెలుగువారపత్రిక. సంపాదకులు శ్రీ చల్లపల్లి వైకుంఠరావుగారు. ముఖ్యంగా ఇది నైజాంపరిస్థితులను తీవ్రంగా ఎదుర్కొని నిర్భయంగా విమర్శిస్తున్నది. కాని వీరేశలింగస్మారకనిధికి నైజామిచ్చిన రు 35,000 లు విరాళమును తిరస్కరించడం లేదు. అందుచేత ఈ పత్రికవిధానంలో మూర్ఖపుఆవేశం లేకపోవడమనే ఒక సుగుణంకనిపిస్తున్నది. శ్రీ వీరేశలింగంగారి శతవార్షికోత్సవాలలో చాలా బూటకమున్నదని వ్రాశారు. కాబట్టి ఇలాంటి బూటకాలు వీరు సహించకపోవడమూ మరొకసుగుణం. ఈ పత్రికలో వయోవృద్ధులు జ్ఞానవృద్ధులునైన శ్రీ డాక్టరు పాలకోడేటి గురుమూర్తి ప్రభృతులుకూడా ఓపికచేసుకొని కలంపట్టివ్రాస్తున్నారంటే- ఈ పత్రిక కొంతకాలం సక్రమంగా నడువగలదనవచ్చు. సం॥ చందా రు 5-0-0 లు. వలయువారు రాజమండ్రి పత్రికా కార్యాలయానికి వ్రాయండి.

## రాయలసీమవాణి

అనంతపురంజిల్లా సనప నుండి శ్రీ అనంతగిరి పేరనార్యకవి సంపాదకత్వమున వెలువడుతున్న తెలుగువారపత్రిక. శ్రీ కవిగారు చిరకాలముగా కాంగ్రెసువాదులు, నిరాడంబరులు; గ్రామజనోద్ధరణాభిలాషులు. వారు తమపత్రికను గ్రామమునుండేనడుపుటయేగాక వారిపత్రికనిండా నూతనస్వాతంత్ర్య ప్రభుత్వములు గ్రామజనోద్ధరణ కేమిచేయవలయునో ఆవిషయములతోనే నింపుచున్నారు. సమర్థులైన పేరనార్యకవిగారి సంపాదకత్వమున నిది చిరకాలము నడుచుగాక.

సం॥ చందా రు 6-0-0 లు వలయువారు కవిగారిపేర సనప అనంతపురంజిల్లా అనివ్రాయుడు.

## దీనబంధు

ఇదిక్రొత్తగా నెల్లూరునుండి వెలువడుచున్న స్వతంత్రజాతీయవాదపత్రిక. సంపాదకులు శ్రీ బెల్లకూరు గోపాలకృష్ణారెడ్డి ఎం. ఏ., ఎల్. ఎల్. బి., ఎఫ్. ఆర్. ఇ. యస్ (లండన్) గారు.

తీవ్రవాదపు రాజకీయములనే ఈపత్రిక ప్రచారముచేయునట్లున్నది. కొంత కమ్యూనిస్టు సానుభూతికూడా ఉన్నదా అనితోస్తున్నది. మొత్తంమీద చాలా ముఖ్యవిషయములతో కూడుకొని ప్రజాసామ్యామునకు ప్రబోధకముగా నీపత్రికయుండవచ్చు. సం॥చందా రు 5-0-0లు కావలసినవారు పత్రికాకార్యాలయానికి నెల్లూరు వ్రాయండి.

## వి వే క చూ డా మ ణి

శ్రీ అభినవతిక్కనేత్యాది బిరుదాంకితులు, పండితకవులునగు శ్రీ దుర్భ సుబ్రహ్మణ్యశర్మగారీ తెలుగు పద్యకావ్యమును రచించినవారు. మూలము శ్రీ శంకర భగవద్పాదులవారు రచించినది. శ్రీ శంకరులు వ్రాసినవానిలో ప్రస్థానత్రయభాష్యములు-ఇంకొకమూలము ననుసరించి తమసిద్ధాంతానుసారము చేయబడిన వ్యాఖ్యానములు, వివేకచూడామణి అట్లుగాక వారు స్వంతముగానే రచించినది. మరియు వారి ప్రకరణములలో కెల్ల నగ్రగణ్యము. విశృంఖలముగా శ్రీ శంకరాచార్యులవారు వ్రాసిన కవితను - స్వేచ్ఛానువాదశీలి శ్రీ శర్మగారు వ్రాసిన పద్యకావ్యము ఉత్తమోత్తమమని వేరుగచెప్పవలయునా? ముముక్షులకీగ్రంథము 'దిద్ది తీర్చినరాజబాట.' శర్మగారిశైలి మనోహరమైన కదళీపాకము. ఆస్తికులగు నాంధ్రులెల్లరు చదివితీరవలసినది. మూల్యము రు 1-12-0 లు, వలయువారు శ్రీ శర్మగారికే రాజవీధి నెల్లూరు అని వ్రాయుడు.

## బొ మ్మ రి ల్లు

శ్రీయుత కే. వి. ఉమామహేశ్వరరావుగారు తాము 1942 నుండీ, ఆంధ్రజ్యోతిలోను, వాణిలోను, భారత్ మాతలోను, ఇంకా ఇతరపత్రికలలోను పిల్లలకొరకువ్రాసినకథలు, పద్యాలు పాటలుఏర్చి ఈపుస్తకంలో కూర్చారు. అన్నీ ఇదివరలోనే ప్రచురమై అందరికీ తెలిసినవే. అయితే పిల్లలు, పిల్లలేమిటి పెద్దలున్నూ, పాతపత్రికలు తిన్నగా ఉంచరు. కాబట్టి ఈచిన్నపుస్తకం పిల్లలకు చాలాఅవసరమే. ఒక్కసారి చదువుకుంటారు. అందంగాకూడాఉన్నది. వెల రు 0-4-0 మాత్రమే. వెలుగుఆఫీసు బరంపురం అనివ్రాయండి.

## మ హా త్మా గాం ధీ జీ

గాంధీగారినిగూర్చి వెలువడిన వాఙ్మయాన్నిఅంతా ఏభాషకాభాషగానే - అంచనావేస్తే ఎంతగా తేలుతుందో? ఒక్కవ్యక్తినిగూర్చి అంతవాఙ్మయం ఎక్కడాఉండదు. ఏమంటేకారణం; ఆయన వ్యక్తి గాదు; సంస్థ. ఆయన మానవజీవితంలో ఏఒక్కగంటకో ఏఒక్కహంశానికో సంబంధించినవాడు కాడు. అహర్నిశాలు, అన్నివిషయాలు ఆయనజోక్యంలేనివేలేవు. అందులోను ఆయన హఠాన్మరణము చెందినపిదప పుట్టిన వాఙ్మయమే కొండలుగ పెరిగిపోయింది. ఈచిన్నపుస్తకం అలాంటిదానిలోనొకటి. ఇది 12 పుటలు; అన్నీపద్యాలే. ఇందులో కన్నీటికాలువ, ఉగాదికానుక అని రెండుభాగములు. రచయిత కల్లూరి అహోబలరావుగారు. వారి రచనములు 'గృహలక్ష్మి' పద్యాలలో మీరు ప్రతిసంచికయందు చూస్తూనేయున్నారు. వలయువారు ఆయనపేర కళ్యాణదుర్గము వ్రాయండి.

## గాం ధీ జీ ని ర్యా ణ ము ( బు ర్ర క థ )

ఇదియు పైతెగకుచెందినగ్రంథమే. ఇదిన్నీ 12 పుటలే. శ్రీ కర్రిరామారావురెడ్డిగారు ఉత్సాహంకొద్దీవ్రాసినది. ఎట్లాపాడినా హృదయవిదారకమైనకథ. వెల రు 0-2-0 లు. వలయువారు మాదేటి సత్యాయనయ్య అండు సన్సు రాజమండ్రి అనివ్రాయండి.

## భారతజ్యోతి (పద్యములు)

ఇదియు శైవానివంటిదైనను - కవిత్వము మంచిపాకమునన్నది. రచయిత నెల్లూరి వాస్తవ్యులు. శ్రీ రేవూరి సుబ్బారావుగారు. వెల రు 0-4-0 మాత్రము. వలయువారు రామదాసు ఖండ్రిక అగ్రహారము, సర్వేపల్లిపోస్టు నెల్లూరుజిల్లా అని వ్రాయండి.

## ఆంధ్రజ్యోతి ఉగాది సంచిక

మంచికథలతో, మంచిబొమ్మలతో అందముగా తయారైనది. "పనిచేసేమనిషి" "ఆడజన్మ" మొదలైన నిత్యజీవితాన్ని, మానవనైజాన్ని బాగాచిత్రిస్తున్నాయి. దీన్ని తయారు చేయించిన సంపాదకులు చక్రపాణిగారెంతయు అభివందనీయులు. వెల రు 1-0-0. వలయువారు ఆంధ్రజ్యోతి కార్యాలయానికి 27 ఆచారప్పన్ వీధి జి. టి. మద్రాసు అని వ్రాయండి,

## నటన

శ్రీమాన్ ముడుంబై శ్రీ రామాచార్యులుగారి సంపాదకత్వాన వెలువడుచున్న సచిత్రమాసపత్రిక. 'ఆధ్యాత్మిక, భౌతిక మానసిక, నిత్యజీవితాల...వివిధరంగాల...ప్రదర్శింపబడే పరమాత్మ అనంత సౌందర్యలీలల యదార్థము, విశేషము, ప్రబోధమును ప్రకటించుటే నట నటన ఆశయం. ఈ ఆశయాన్ని అనుసరించి పత్రిక నడపడానికి ఆచార్లుగారు కడుసమర్థులు. ప్రథమసంచికే అందుకుతార్కాణం. పత్రికఅంతంలో వారు వారు 'అయాపనులుచేయ 'గలరు' అని ఆజ్ఞామాత్రంగా ప్రకటించడం వారిఆత్మవిశ్వాసం తెల్పుతున్నది. ఈపత్రికకు మంచిపురోభివృద్ధిగలదు. 'కళ'ను గూర్చినపత్రికలను ఆంధ్రులు నడుపగలరా అన్న సంశయాలను వీరు తీర్చగలరని మావిశ్వాసం. సం|| చందా రు 5-0-0లు. వలయువారు 42 A. బజారురోడ్డు రాయపేట మద్రాసు అనివ్రాయండి.



సుందరమగు ఏడురంగులలో

శ్రీ గురువాయూర్ దివ్యప్రభు చిత్రపటము

గురువాయూర్ భూలోకవైకుంఠము. అందు వేంచేసియుండు వైకుంఠనాథుడు భక్తులందరకు వరంబులొసంగును. పటమునుపూజించి ధన్యులుకండు.

వెలపటము 1 కి రు 2-0-0; పోస్టేజి అదనము;

వెలకు దొరకుస్థలము.

సి. కృష్ణఅయ్యర్, 12-A. కెన్నడివీధి,

లజ్, మైలాపూరు, మద్రాసు

ఏజంట్లు కావలయును.

Printed and Published by Dr. S. Seshagiri Rao, at the Lodhra Press, Kesari Kuteeram Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.